# డాక్టరు వచ్చేలోగా
# ఏం చెయ్యాలి?

భారత ప్రభుత్వము 1957 వ సంవత్సరమున నిర్వహించిన పోటీలలో
పండ్రెండు దేశభాషలలోని పుస్తకములలోను ఉత్తమోత్తమైనవిగా ఎంచబడి
వెయ్యేసిరూపాయిల బహుమానముపొందిన అయిదింటిలోను ఇదియొకటి


రచయిత

**యస్. యల్. నరసింహారావు,** బి.ఏ., ఎల్. టి.

గవర్నమెంటు పి. ఆర్. సి. హయ్యరు సెకండరీస్కూలు—కాకినాడ



ఆధునిక విజ్ఞాన గ్రంథమాల

శ్రీరామనగరం—కాకినాడ.

## అంకితం



మిత్రుడు

స్వర్గీయ శ్రీ టి. కె. గోపాలాచారి

పవిత్రాత్మకు

# ప్రస్తుతం

డాక్టరువచ్చేలోగా ఏం చెయ్యాలి ?
ఏం చెయ్యాలి ? ?
అనే సమస్య అందరికీ ఏదో సమయంలో ఉత్పన్నమవుతూఉంటుంది. ఈసమస్యకు పరిష్కారంమాత్రం వెంటనే తోచదు. అయినా-

కంగారుపడకూడదు,
పరిస్థితి పాడుచేయకూడదు,
డాక్టర్ని పిలవడం తప్పించుకోవాలని చూడకూడదు-
అనిమాత్రం అందరూ జ్ఞాపకముంచుకోవాలి.

ప్రమాదాలు మానవజీవితంతో అవినాభావంగా ఉంటాయి. వాటినుండి తప్పించుకోవడమునకు ఎంత ప్రయత్నించినా ఒక్కొక్కప్పుడు తప్పవు.

అటువంటప్పుడు ప్రథమచికిత్స అవసరం. ఆ పద్ధతులు మనకు అదివరకే తెలిసివుంటే సమయానికి స్ఫురిస్తాయి. అట్టి ప్రయోజనం ఆశించియే భారతప్రభుత్వమువారు సామాన్యజనులకు తెలిసేలాగున ఇట్టి గ్రంథ రచనలను ప్రోత్సహిస్తున్నారు.

ఈపుస్తకంలో అభూతకల్పనలూ, ఊహాగానములూ లేవు. ఇందలి పెక్కు సంఘటనలు రచయిత అనుభవంలో ఉన్నవీ, కన్నవీ, విన్నవీ.

—ర చ యి త

# విషయసూచిక

# ప్రమాదములు

పూజ్యులైన నాన్నగారికి,

సుశీల నమస్కారములు.

పదిహేనురోజుల క్రితం మీరు వ్రాసిన జాబు చేరింది. ఈమధ్య ఒక విచారకరమైన సంగతి జరిగింది. అందువల్ల మనస్థిమితం లేక మీఉత్తరమునకు వెంటనే జవాబు వ్రాయలేకపోయాను. క్షమించ కోర్తాను.

మాదొడ్లో ఉన్న పశువుల సావడి చాలాపురాతన మైనది. దాని వాసాలన్నీ పుచ్చిపోవడంచేత పైకప్పు ఈమధ్య కూలిపోయింది. కొత్తవాసాలు వేసి వాటికి రీపరుబద్దలు బిగించుమని మీ అల్లుడుగారు ఒక వడ్రంగికి పురమాయించారు. క్రిందటి సోమవారంనాడు మధ్యాహ్నం వడ్రంగి, ఒక కూలివాడు దొడ్లో పనిచేస్తున్నారు. నేను ఇంట్లో కూర్చొని పాపాయికి గౌను కుడుతున్నాను. మీ అల్లుడుగారు ఆఫీసుకు వెళ్లారు. సుమారు మూడుగంట

లకు దొడ్లోంచి కెవ్వుమని ఒక కేక వినపడింది. వెంటనే అక్కడికి వెళ్లి చూతునుకదా పశువుల సావడిలో పని చేస్తున్న కూలివాడి చేతినుండి రక్తం కారిపోతోంది. ఆ ప్రదేశమంతా రక్తమయంగా ఉంది. నేను అచ్చటికి వెళ్లగానే వాసాలమీద కూర్చొని ఉన్న వడ్రంగి క్రిందికి దిగి "అమ్మగారూ! రక్షించండి తల్లీ! నేను వాసాలకు రీపరుబద్దలు వేసి మేకులు కొడుతున్నాను-క్రింద కొన్ని మేకులు జారి పడ్డాయి-వాటిని కూలివాడు ఏరుతున్నాడు-ఇంతలో నా చేతులో ఉన్న బాడిద జారి వాడిచేతిమీద పడింది. వాడి చెయ్యి తెగి రక్తం కారుతోంది-ఇంతకు తప్ప నే నేపాపమూ ఎరుగనమ్మా," అని చెప్పి వాడు అచ్చటినుండి పారిపోయాడు. ఇంతలో మా పనిమనిషి అచ్చటికి వచ్చింది. దానిద్వారా వెంటనే డాక్టరు మాధవ రావుగారికి కబురుచేశాను. ఆయన త్వరగానే వచ్చారు. శుభ్రమైన గుడ్డ, నీరు తెమ్మన్నారు. తడిగుడ్డతో వాడి చేతిమీద నున్న రక్తాన్ని తుడిచారు. అప్పుడు గాయం బాగా కనపడింది. కాని ఆ గాయంనుండి రక్తం అలలు అలలుగా వస్తూనే ఉంది. డాక్టరుగారు వెంటనే గాయానికి పైన చేతికి గుడ్డపేలికతో కట్టుకట్టి వాడిని ఆయన కారులో ఆసుపత్రికి తీసికొని వెళ్లారు. మీ అల్లుడుగారికి కబురు

చేశాను. ఆయన వెంటనే వచ్చి డాక్టరుగారిని కలుసుకొని ఎంతఖర్చైనా కూలివాడికి ప్రాణాపాయం కలుగకుండా చూడం డని ఆయనను కోరారు. అధికరక్తస్రావంవల్ల కలిగిన ప్రమాదాన్ని అరికట్టడానికి పాప మారోగి శరీరం లోకి రక్తంకూడా ఎక్కించారట! కాని డాక్టరుగారు ఎంత శ్రమపడ్డా ప్రయోజనం లేకపోయింది. పాప మాకూలి వాడు మరుచటిరోజు ఉదయం అయిదు గంటలకు చని పోయాడు. అప్పటినుండి మీ అల్లుడుగారికీ, నాకూ మన స్థిమితం లేదు. నా కాదృశ్యం కళ్ళకు కట్టిపోయింది. రాత్రులు తిన్నగా నిద్ర పట్టడం లేదు. పాప మాకూలి వాడు పదహారేండ్ల కుఱ్ఱవాడు. వాడి చిన్నతనంలోనే వాడి తల్లీ తండ్రి కలరా వచ్చి చనిపోయారట! అప్పటినుండీ వాడు వాడి మేనమామ దగ్గర ఉంటున్నాడట. ఈ విష యాలన్నీ తలుచుకొంటే నా కెంతో దుఃఖం వస్తోంది. నాన్నా! మీకు వెంటనే ఉత్తరం వ్రాయలేకపోడానికి కారణం ఈ విషాదసంఘటనమే. ఇంతకన్నా ఈ ఉత్త రంలో ఇం కేమీ వ్రాయలేను. మీ అల్లుడుగారు ఆఫీసుకు నాలుగురోజులపాటు సెలవుపెట్టి యింటివద్దనే ఉండి పోయారు. ఇప్పుడు ఆఫీసుకువెళ్లి పనిచేసుకొంటున్నారు. చిరంజీవి పాపాయి ఆరోగ్యంగా ఆడుకొంటోంది.

మ. ల. స. అమ్మగారి ఆరోగ్యం ఇప్పు డెలా గున్నదీ తెలుపకోర్తాను. చిరంజీవి తమ్ముడు ఇంటరుమీడి యేటు ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణు డయినందుకు మీ అల్లుడు గారు నేనూ ఎంతో సంతోషించాము. వాడు ముందు ఏమి చదువదలచుకొన్నాడో వ్రాయకోర్తాను.

ఇట్లు,

విధేయురాలు,

సుశీల.

డాక్టరు ఐ. వైద్యనాధరావు,
యమ్. డి.

"ఆరోగ్యసదనం"
మ హా భా గ్య పు ర ం,
అక్టోబరు 24.

# ప్ర థ మ చి కి త్స

చిరంజీవి సౌభాగ్యవతి సుశీలను,

ఆశీర్వదించి వ్రాయునది.

అమ్మాయీ, నీవు వ్రాసిన ఉత్తరంలోని విషాద వార్త నామనసునుకూడా చాల కలవరపరచింది. ఇట్టి ప్రమాదాలు ఇండ్లలోనూ, రోడ్లమీద, ప్రయోగశాలలలోను, కర్మాగారాలలోను సంభవిస్తూ ఉంటాయి. మనం ఎంత జాగ్రత్తపడినా ఒక్కొక్కప్పు డీప్రమాదాలు కలుగుతూనే ఉంటాయి. ప్రమాదాలు కలిగినపుడు ప్రక్కనున్నవారు సాధారణంగా భయపడిపోయి ఏంచెయ్యాలో తోచక పరుగెత్తుకుపోతారు. విశేషమైన రక్తాన్ని చూచినపుడు తెలివి తప్పి పడిపోయినవాళ్లను ఎంతోమందిని నేను చూచాను. ప్రమాదం కలిగినపుడు ఏమిచేయాలో తెలిసినవారిలో

కూడ కొంతమంది ఆ భయానకమైనదృశ్యం చూడగానే కలవరపడిపోతారు. ప్రమాదాలగురించీ, అవి కలిగినపుడు రోగికి ప్రాణాపాయం కలుగకుండా చేయవలసిన విధానాలగురించీ నీ కెంతపాండిత్యం ఉన్నా, నిజంగా ఒకరికి ప్రమాదం కలిగినపుడు భయపడిపోయి ఏమిచెయ్యాలో ఆసమయంలో స్ఫురించకపోతే నీవు నేర్చిన విషయాల వలన ప్రయోజనం ఏమీ యుండదు. కనుక ఏదైనా ప్రమాదంగాని ఆకస్మిక పరిస్థితిగాని ఏర్పడినప్పుడు కలవరపడకూడదు. నీమనసు ప్రశాంతంగా ఉంటేనే నీకు సమయస్ఫూర్తి ఉంటుంది; నీకర్తవ్యాన్ని నీవు చక్కగా నిర్వర్తించుకోగలుగుతావు. ఈవిధంగా రోగికి నీవు ఉపయోగపడడమేకాకుండా నీచుట్టుప్రక్కలవాళ్లకు ధైర్యం, సాహసం కలుగజేసినదాన వవుతావు.

ఏదైనా ప్రమాదం సంభవించినపుడు డాక్టరు అవసరంలేదనీ, మనమే చికిత్స చేయవచ్చుననీ నేను చెబుతున్నానని ఎంతమాత్రం అనుకోవద్దు. ప్రమాదకరమైన పరిస్థితి ఏర్పడినపుడు మనకు డాక్టరు సహాయం ఎంత త్వరగా లభిస్తే అంత మంచిది. కనుక అట్టిసమయంలో వైద్యునకు వెంటనే కబురుపెట్టాలి. కాని అట్టిప్రమాదమేదైనా సంభవించినపుడు వైద్యుడు వచ్చులోపున రోగి

స్థితి మరింత ప్రమాదించకుండుటకు మనము తగిన చికిత్స చెయ్యాలి. మనము చేసే ఈతాత్కాలిక చికిత్సనే 'ప్రథమ చికిత్స' అంటారు. సకాలంలో ప్రథమచికిత్స చేయకపోతే రోగికి మరణంకూడా సంభవింపవచ్చును. కనుక ప్రతి వ్యక్తి ప్రథమచికిత్స ఎట్లుచెయ్యాలో తెలిసికొనడం చాలా అవసరం.

ఆడుదాన్ని నాకెందు కీవిషయాలు అనుకోవద్దు. ఈవిద్య స్త్రీలకూ పురుషులకూ కూడా అవసరమే. రేపు నీ పాపాయి కత్తితో వ్రేలు కోసుకోవచ్చును. మీ వంట లక్క వంటచేస్తున్నపుడు ఆమె చీర అంటుకోవచ్చును. మీ ఇంటికి ఎదురుగా ఉన్న రోడ్డుమీద సైకిలుక్రింద పడడం చేత ఎవరికైనా ఎముక విరుగవచ్చును, మీ ముసలి అత్త గారు సొమ్మసిలి పడిపోవచ్చును—ఇట్టి పరిస్థితి ఏదైనా సంభవించినపుడు నీకు ప్రథమచికిత్స తెలిసిఉంటే ఎంత ఉపయోగం ఉంటుందో ఆలోచించు. డాక్టరు వచ్చేలోగా రోగియొక్క పరిస్థితి విషమించకుండా సకాలంలో చేయ వలసిన చికిత్స నీవు చేయకలుగుతే అందువలన నీకు కలిగే ఆనందానికీ, సంతృప్తి కీ మేరఉండదు. ఇతరులకు నీవు సహాయంచేయగలిగే అవకాశం నీకుకలిగించినందుకు భగవంతునికి నీవు నమోవాకములు అర్పిస్తావు.

ఇక్కడ ఉన్నపుడు నీ వనేక విషయాలు నన్ను అడుగుతూ ఉండేదానివి; వాటిని గురించి నేను చెబుతూ ఉండేవాడిని. ఇప్పుడు నీవు మీ అత్తవారియింట్లో ఉండటం చేత ఈ పరస్పరసంభాషణలకు వీలులేదు. మొన్న నీవు వ్రాసిన ఉత్తరం చదివినప్పటినుండి ప్రథమచికిత్సను గూర్చి నీకు కొన్ని జాబులు వ్రాయాలని అనిపించింది. కనుక ఇప్పుడు కొన్ని జాబులు వరుసగా వ్రాస్తాను. అవి నీవు శ్రద్ధగా చదువు. ఆజాబులలో శాస్త్రపరిభాష గుప్పించ కుండా సులభంగా నీకు అర్థమయేలాగున వ్రాస్తాను. వాటిలో నా అనుభవాలనుకూడా పొందుపరుస్తాను. అవి నీకెంతో ఉపయోగపడతాయి. నా జాబువలన ప్రథమ చికిత్సకు సంబంధించిన విజ్ఞానం నీకు కలిగి ఆ విజ్ఞానం నీకూ నీకుటుంబంలోనివారికి, నీ ఇరుగుపొరుగువారికీ ఉప యోగపడుతుందని నా విశ్వాసం.

ఇట్లు,

మీ నాన్న,

వైద్యనాథరావు.

# నలుకులు, గాయములు రక్తస్రావము

చి. సౌ. సుశీలకు,

అమ్మాయీ, మీయింటిలో జరిగిన ప్రమాదాన్నిబట్టి ఈయుత్తరములు వ్రాయవలెనని నాకు తోచినది. కనుక మొదట గాయములనుగూర్చియే నీకు వ్రాస్తాను.

కొన్నిరకములైన సూక్ష్మజీవులు గాయములలో ప్రవేశించడంచేతనే అవి చీముపడతాయి. అంతేకాదు; వాటి వలన ధనుర్వాతం **(Titanus)** మొదలైన రోగాలుకూడా వస్తాయి. గాయములవద్ద ఇటువంటిరోగాలను కలుగచేసె సూక్ష్మజీవులు చేరకుండా చాలారకాల మందులు ఇప్పుడు మన కందుబాటులో ఉన్నాయి. కాని శరీరభాగ మేదైనా తెగినపుడు ఆ గాయంలో తాటిపువ్వారమో, సాలిగూడో, కరిదూపమో, వెలిబూడిదో వేసి కట్టుకట్టేవాళ్లు ఈరోజుల్లో కూడా ఉన్నారు. వాళ్ళ అవివేకము తలుచుకుంటే నాకు చాలా జాలివేస్తుంది. త్రుప్పుపట్టిన మేకు శరీరంలో గ్రుచ్చు

కొంటే వెంటనే డాక్టరుదగ్గఱకు పోయి సలహా పొందాలి. ఆ మేకుపైన ధనుర్వాతం కలుగచేసే రోగాణువులు ఉండ వచ్చును. ధనుర్వాతంరాకుండాచేసే ఇంజక్షనును (Injection) డాక్టరు వెంటనే యిస్తారు. ఆ వాతం రాకుండా ముం దుగా జాగ్రత్తపడాలి. ఆ రోగం వచ్చిన తర్వాత చేసే చికిత్సవలన ప్రయోజన ముండకపోవచ్చును. నీకు చిన్న తనంలో శ్రీ సూక్తం చెప్పిన పావయ్యశాస్త్రిగారి కీమధ్య కాలికి కత్తిపీట తగిలి గాయమైంది. ఆగాయముపై ఆయన గోమయం వేసి కట్టుకట్టేరు. నాల్గవరోజున ఆయనకు ధనుర్వాతం వచ్చింది. వెంటనే ఆస్పత్రిలో చేర్చారు; చికి త్సలు చేయించారు—ప్రయోజనం లేకపోయింది. తుద కాయన స్వర్గస్థులయారు. ఆవు, గేదె మొదలైన జంతు వులమలంలోను, మట్టిలోను ధనుర్వాతం కలుగచేసే రోగా ణువు లుంటాయి. కనుక కాళ్లకు గాయం తగులుతే ముఖ్యంగా ఎక్కువశ్రద్ధ తీసికోవాలి.

గాయాలకి ప్రథమచికిత్సను చేసేవారు మొదట వారి చేతులను సబ్బునీళ్లతో బాగా తోమి కడుక్కోవాలి. వారి వ్రేలి గోళ్లను కూడా పరిశుభ్రం చేసికోవాలి. ఇదంతా చేదస్తం అనుకుంటారేమో! ఇట్టి జాగ్రత్తలు తీసికోక పోవడంచేత చాలా గాయాలు విషమించాయి.

చాకు, గాజుముక్క—ఇటువంటి వాటిచేత కలిగే గాయాలకు టించరు అయోడీను రాయాలి. క్రొత్త చీపురు పుల్ల కొనకు పరిశుభ్రమైన దూదిని చుట్టి దానిని అయోడీనులో ముంచి ఆ పుడకతో గాయంపైన రాయడం మంచిది. తరువాత పరిశుభ్రమైన గుడ్డపేలికను గాని లేక 'గాజు' అనే గుడ్డముక్కను గాని బొరాసికు ఆమ్లద్రావణంలో ముంచి దానిని గాయముపై వేసి పరిశుభ్రమైన గుడ్డతో కట్టు కట్టాలి. గాయాలలో మట్టి మొదలైన పదార్థములు ఉండటంవలన అవి అపరిశుభ్రంగాఉండవచ్చును. అప్పుడు టించరు అయోడీనును ముందుగా ఆ గాయముపై రాసి తరువాత సల సల కాచి చల్లార్చిన నీటితో కాని, బొరాసికు ఆమ్లద్రావణంతో కాని కడిగి పైవిధంగానే గాజు వేసి కట్టు కట్టాలి. చిన్నగాయం అయితే రక్తం కొంతసేపు కారి తరువాత గాయంవద్ద అది గడ్డకడుతుంది. ఈ రక్తపు గడ్డ ఒక బిరడాలాగ పనిచేసి రక్తాన్ని యిక కారనివ్వదు. రక్తం కొంచెం వేగంగా వస్తూఉంటే గాయంవద్ద ఏర్పడిన రక్తపుముద్ద కొట్టుకుపోతుంది. అప్పుడు గాయంమీద మన బొటనవ్రేలు వేసి నొక్కినట్టయితే కొంతసేపటికి రక్తం కారడం మానేస్తుంది. నరకు పొడుగుగా ఉంటే ప్రథమ చికిత్స చేసిన వెంటనే అతనిని డాక్టరువద్దకు తీసుకు

పోవడం మంచిది. ఆయన ఆగాయం రెండుఅంచులను దగ్గరకు చేర్చి కుట్లు వేయుదురు. అందువలన గాయం త్వరగా మానడమేకాకుండా చర్మంమీద పెద్ద మచ్చ ఏర్పడదు.

ప్రథమచికిత్స చేసిన పిదప గాయం త్వరలో మానిపోతే సరేసరి. లేక అచ్చట ఎఱ్ఱపడి, వాచి, ఆవాపు చుట్టుపట్లకు వ్యాపించి బాధకలుగుతే ఆగాయం డాక్టరుకు చూపించడం అవసరమని సలహా యివ్వాలి.

పైన బోరాసికామ్లద్రావణము అని చెప్పాను. దానిని యిలా తయారుచేసుకోవాలి. ఒక గాజుగ్లాసెడు మరుగుచున్న నీటిలో ఒక టీచెంచా బోరాసికు ఆమ్లము గుండను వేసి ద్రావణమును తయారుచేయాలి. ప్రతీ యింట్లోను ప్రథమచికిత్సకు పనికివచ్చే వస్తువులను ఒక పెట్టెలో జాగ్రత్త పెట్టుకొని ఉంచుకోవాలి. వీనిని గూర్చి తరువాత ఒక ఉత్తరంలో వ్రాస్తాను.

ఒక్కొక్కప్పుడు పెద్ద రక్తనాళం తెగినప్పుడు రక్తం కట్టకుండా కారుతూ ఉంటుంది. మన శరీరంలో రెండురకాల రక్తనాళా లున్నాయి. ఒకరకం గుండెనుండి రక్తాన్ని శరీరభాగాలకు తీసికొనిపోతాయి. మరియొకరకం శరీరభాగాలనుండి గుండెకు రక్తాన్ని తీసికొని వస్తాయి. మొదటిరకం రక్తనాళం తెగితే రక్తం అలలు అలలుగా

ఆగియాగి కారుతుంది. ఆ రక్తం ప్రకాశవంతమైన ఎఱ్ఱ రంగుగా ఉంటుంది. రెండవరకం రక్తనాళం తెగితే రక్తం ఏకధారగా కారుతుంది. ఈరక్తం నల్లని ఎఱుపురంగు కలిగి ఉంటుంది. మొదటిరకం రక్తనాళాలను 'ధమనులు' అంటారు. రెండవరకం నాళాలను 'సిరలు' అంటారు. ఈరక్తనాళాలు తెగి రక్తం కారుతూ ఉంటే కొంత సేపటికి అదే కడుతుంది కదా అని ఊరుకోకూడదు.

క్రిందటి దీపావళి పండుగనాడు ఒక పిల్లవాడు సీమ టపాకాయలు వెలిగించి వాటిపైన సిగరెట్టుడబ్బా మూత వేశాడు. అవి ప్రేలినపుడు ఆ డబ్బా విడిపోయి ఆ రేకు ఆ పిల్లవాని తొడలో గుచ్చుకుంది. అది చిన్నగాయం అయినప్పటికీ, అధికంగా రక్తం స్రవించడం మొదలు పెట్టింది. పండుగ సందడిలో మొదట అశ్రద్ధ చేశారు. శరీరంలోని రక్తం చాలాభాగం కారిపోవడంవలన తరువాత ఆ పిల్లవానికి చికిత్స ఏమీ లాభం లేకపోయింది. ఆనాడు మీ ఇంట్లో గాయపడి చనిపోయిన కూలివానిసంగతి కూడా అంతే. గాయంపడ్డవెంటనే రక్తం కారకుండా తగిన చికిత్స చేసిఉంటే వాళ్ళ ప్రాణాలు తప్పకుండా దక్కి ఉండేవి.

చేతికి గాయం తగిలి విశేషంగా రక్తం కారిపోతూ ఉంటే ఏమిచెయ్యాలి? వెంటనే డాక్టరుకు కబురుపంపాలి. నీచేతులను సబ్బునీటితో బాగుగా కడుక్కోవాలి. పరిశుభ్రమైన గుడ్డముక్కను మడచి దానిని గాయములోనికి జొన్పి నొక్కి పట్టుకోవాలి. ఈ క్రియవలన రక్తం ఇక స్రవిం



గాయముపై ఒత్తిడిని కలుగచేసి
రక్తస్రావమును అరికట్టుట

చదు. ఈవిధంగా చేసినా యింకా రక్తం కారుతూఉంటే ఆ రక్తం ఏవిధంగా కారుచున్నదీ గమనించాలి. అది అలలు అలలుగా స్రవిస్తూంటే గాయానికి పైన (అనగా గాయానికి గుండెకు మధ్యను), అది ఏకధారగా ప్రవహిస్తూ ఉంటే గాయానికి క్రిందనూ బిగింపుకట్టు **(Tourniquet)** కట్టాలి. ఈవిధమైన కట్టు కట్టడానికి బెల్టు, చేతిరుమాలు, శుభ్రమైన గుడ్డపేలిక—వీనిలో దేనినైనా ఉపయోగించ



బిగింపు కట్టు

వచ్చును. శుభ్రమైన మరియొక గుడ్డపేలికను మడతపెట్టి ఒక మెత్తగాచేసి దానిని గాయమునకు రమారమి రెండు అంగుళముల దూరములో ఉంచవలెను. దానిపైన చేతి చుట్టును బిగించి కట్టు కట్టాలి. ఈ కట్టులోనికి చిన్నపుల్ల ముక్కను జొన్పి దానిని త్రిప్పుచు మెత్తను, అచ్చటనున్న రక్తనాళమును గట్టిగా నొక్కునట్లుగా బిగించాలి. ఈవిధంగా చేస్తే రక్తస్రావం నిలిచిపోతుంది.

ఈ సందర్భంలో నీ కొక హెచ్చరిక చేయవలసి యున్నది. ఈ బిగింపుకట్టును పదిహేనునిమిషాలకుమించి ఉంచకూడదు. అంతకంటె ఎక్కువకాలం ఉంచినయెడల

ఆ కట్టు క్రిందిభాగములకు రక్తము ప్రసరింపదు. అందువల్ల ఆభాగములలోని మాంసము క్రుళ్లి చచ్చుపడి పోవును. తరువాత ఆ అవయవము ఖండించి తీసివేయక పోతే ప్రాణహానికూడా కలుగుతుంది. కనుక ఈకట్టును కట్టినపుడు త్వరగా వానిని డాక్టరువద్దకు తీసికొనిపోవలెను. త్వరలో డాక్టరు దొరకనిచో ఆ బిగింపుకట్టును పదిహేను నిమిషముల కొకసారి సడలించి ఒక నిమిషము పోయిన పిదప మరలబిగించి కట్టుచుండవలెను.

ఈ ఉత్తరమును ముగించేముందు మరియొక ముఖ్యమైన విషయం నీకు తెలియచెయ్యాలి. గాయపడిన వాడు తన శరీరమునుండి కారిపోవుచున్న రక్తమును చూచినపుడు భయపడి సొమ్మసిలవచ్చును. అప్పుడు నీవు కంగారు పడనవసరం లేదు. ఆవిధముగ అతడు సొమ్మ సిల్లుట అతనికి ఒకవిధముగ మేలే కలుగచేస్తుంది. సొమ్మ సిలినపుడు గుండె మెల్లగా కొట్టుకుంటుంది. అందువలన రక్తస్రావం తగ్గుతుంది. అప్పుడు గాయంవద్ద రక్తం గడ్డకట్టి, బిరడావలె నిరోధము ఏర్పడి ఇక రక్తమును కారకుండా చేస్తుంది.

వైద్యనాధరావు.

# పిచ్చికుక్క కాటు

చి. సౌ. సుశీలకు,

అమ్మా, ప్రమాదాలు చెప్పిరావు. ఈ చిత్రం చూడు.

ఈమధ్య కొద్దిరోజులక్రితం నావద్దకు పదహారు సంవత్సరాల వయసుగల పిల్లవాడిని ప్రక్క పల్లెనుండి తీసుకువచ్చారు. పాపం వాడికి అప్పటికి నెలరోజులక్రితం కుక్క కరిచిందట. తరువాత ఆ కుక్క ఏమయిందో వారికి తెలియదు. వారంరోజులనుండి పిల్లవాడు మందంగా ఉన్నాడు. వాడు స్వతహాగా చాలా చలాకీగా ఉండేవాడే! కాని ఇప్పు డాచుఱుకుతనం ఏమీ లేదు. బెల్లంకొట్టిన రాయిలాగ మాట్లాడకుండా కూర్చుంటాడు. వాడికి నిద్ర రాదు, అన్నహితవు లేదు, తల నొప్పి, కొంచెంగా జ్వరం.

నే నప్పుడు ఏమిచేశానో తెలుసా? ఒక పళ్లెంతో నీళ్ళు తీసుకురమ్మనమని నౌఖరుతో చెప్పాను. మీ అమ్మ నాప్రక్కనే నిలబడి ఉంది. నౌఖరు నీరు తీసుకువచ్చాడు. ఆ నీటిని రోగిదగ్గరకు తీసుకు వెళ్ళమన్నాను. నౌఖరు

అలాగే చేశాడు. వెంటనే రోగి ముఖం చిట్లించుకొని, బుసకొడుతూ భయంకరంగా విజృంభించి ఆనీరు గల పళ్లెం తన్నిపారేశాడు. వాడికి 'హైడ్రోఫోబియా' అనే రోగం వచ్చింది. నీటిని చూస్తే ఆరోగికి విపరీతమైన భయం కలుగుతుంది. ఇది ఆరోగంయొక్క ముఖ్య లక్షణం. ఆపిల్లవాడిని యింటికి తీసుకుపొమ్మనమనీ, ఇక ఏమందువల్లా లాభంలేదనీ, పిల్లవాడు దక్కడం కష్టమనీ వాళ్ళతో చెప్పాను.

మీ అమ్మది జాలిగుండెకదూ! ఇదంతా చూసి ఆమె నాతో యిలా అంది. "అదేమిటండీ ఈవిపరీతం! మీరందరికీ మందులు యిస్తారు, ఈపిల్లవాడు ఏమిపాపం చేసుకొన్నాడండీ, మీరు వాడికి మందివ్వకుండా పంపించే శారు?" అంది. నాకు ఆపిల్లవాడిని చూస్తే చాలా జాలిగానే ఉందనీ, కాని ఆరోగం రాకుండా ముందుగా జాగ్రత్త పడాలి కాని రోగం వచ్చిన తరువాత ఎవరూ ఏమీ చేసేది లేదనీ ఆమెకు నచ్చచెప్పడానికి నా తలప్రాణం తోకకు వచ్చింది.

పదిహేనురోజులు పోయినతరువాత ఆ పిల్లవాని బంధు వొకడు నాతో పనుండి వచ్చాడు. ఆయన నాతో పిల్లవాడిని గురించి యిలా చెప్పాడు. ఇక్కడినుండి ఇంటికి

తీసికొనిపోయిన మరునాటినుండి వెఱ్ఱికేకలు వేయడం మొదలుపెట్టాడు. గొంతుకలో ఉన్న కండరాలు బిఱ్ఱ బిగుసుపోయాయి. ఏమీ మ్రింగలేకపోయేవాడు. క్రమంగా ప్రతి అవయవంలో కదలిక పోయింది. గుండె నీరసిం చింది. రెండురోజు లయినపిదప వాడు చనిపోయాడు. చూశావా! పిచ్చికుక్క కరవగానే ప్రథమచికిత్స చేసి, ముందుగా జాగ్రత్త పడకపోవడంవలన పండులాంటి కుఱ్ఱ వాడు పరలోకం పాలయాడు.

'హైడ్రోఫోబియా' జాడ్యం ఒక రోగాణువువలన కలుగుతుంది. ఈ రోగాణువులు పిచ్చికుక్క, పిచ్చినక్క మొదలైన జంతువుల ఉమ్మినీటిలో ఉంటాయి. ఆ జంతువు ఎవరి నైనా కరవగానే గాయంలో దాని ఉమ్మినీటిలో ఉన్న రోగాణువులు రక్తంద్వారా రోగి మెదడును, నాడులను చేరుకుంటాయి. అప్పుడు నాడీమండలం క్రమంగా బల హీనం చెందుతుంది. తుదకు గుండె నీరసించి ఆగి పోతుంది.

ఈ ప్రమాదకరమైన రోగం రాకుండా ఉండాలంటే ఏమిచెయ్యాలో యిప్పుడు చెబుతాను. పిచ్చిది అని అను మానం గల ఏజంతువు కరచినా గాయంవద్దనున్న విషము గలరక్తము శరీరములోని లోపలిభాగములకు పోకుండా

గుండెకు, గాయానికి మధ్య బిగింపుకట్టు కట్టాలి. బిగింపు కట్టును గురించి యిదివరలో నేనుచెప్పిన వివరములను మరచిపోకూడదు. లేనిచో ప్రమాదం సంభవిస్తుంది. తరువాత గాయాన్ని వెడల్పుగా చేసి రక్తమును పిండివేయాలి. ఒక చీపురుపుల్ల చివరను కొద్దిగా దూదినిచుట్టి ఆ కొనను 'కార్బాలికు ఆమ్లము' లో ముంచి దానిని గాయములోనికి జొనాపాలి. గాయముచుట్టునూ ఉన్న చర్మమునకు కార్బాలి కామ్లమును తగులనీయకూడదు. ముందుగనే గాయము చుట్టూ వ్యాసలీనుసు రాయాలి. కార్బాలికు ఆమ్లము నీకు వెంటనే దొరకకపోతే ఎఱ్ఱగా కాల్చిన యినుపదబ్బనముతో గాయమును కాల్చివెయ్యాలి. పైవిధంగా చేస్తే గాయంలో ఉన్న రోగాణువులు నాశనమవుతాయి.

జంతువు కరచిన వెంటనే యింత జాగ్రత్త మనం పడినప్పటికీ కొన్ని రోగాణువులు రోగి శరీరం లోపలి భాగాలలోనికి పోవడానికి అవకాశం ఉంది. కనుక ఆ రోగిని జిల్లా ఆసుపత్రికి తీసుకొనిపోయి 'పాస్టరు' చికిత్స చేయించాలి. హైడ్రోఫోబియా అనేరోగం రాకుండా ఉండుటకు 'పాస్టరు' అనే శాస్త్రజ్ఞుడు ఒక మందు కనిపెట్టాడు. వెంటనే ఆ చికిత్స ప్రారంభించాలి. బొడ్డుకుచుట్టు 14 ఇంజక్షనులు రోజుకు ఒకటిచొప్పున యిస్తారు. రోగం

వచ్చిన తరువాత ఆ మందు పనిచేయదు. రోగం రాకుండా అది కాపాడగలదు.



లూ యీ పా స్టరు

ఏ కుక్క కరచినా 'పాస్టరు చికిత్స' చేయించాలా? లేక అది పిచ్చికుక్క అని నిశ్చయమైతేనే ఆ చికిత్స చేయించాలా ? అనే సందేహం చాలామందికి కలుగ వచ్చును. అయితే పిచ్చికుక్కకుండే లక్షణాలేమిటి ? అది తూలుతూ నడుస్తుంది. దాని నాలుక వ్రేలాడుతూ ఉంటుంది. నోటివెంట నురగలు కారుతాయి. దాని జోలికి పోకపో

యినా అందరినీ వరుసగా కరుస్తూ పోతుంది. అటువంటి కుక్క కరచినపుడు సందేహించకుండా 'పాస్టరుచికిత్స' ప్రారంభించవలసిందే! కాని ఒక్కొక్కప్పుడు మన యింట్లో ఉన్న పెంపుడుకుక్క నిష్కారణంగా యింట్లో ఉండేవారినే కరువవచ్చును. దానికి పైనచెప్పిన లక్షణా లేమీ ఉండకపోవచ్చును. అప్పు డాకుక్క పిచ్చిదా? కాదా? అనే సందేహం మనకు తప్పకుండా కలుగుతుంది. దానికి రోగం ప్రారంభదశలో ఉన్నదేమో! అప్పుడు కూడా దాని ఉమ్మి నీటిలో రోగాణువు లుండవచ్చును. అటువంటప్పుడు మనం ఏంచెయ్యాలి? ఆ కుక్కను కట్టి వేసి దానికి రోజూ దూరంగా ఉండి తిండి పెడుతూ ఉండాలి. అది పిచ్చికుక్క అయితే ఒక పక్షంలోగా దానికి పిచ్చికుక్కకుండే లక్షణాలన్నీ కనబడి తుద కది చనిపోతుంది. అది అలా చనిపోకుండా ఆరోగ్యంగా ఉంటే పాస్టరుచికిత్స చేయించుకొననక్కరలేదు. కాని ఆ కుక్కను మనము కట్టకముందే పారిపోయి మరల రానిచో మనము సంశయించకుండా 'పాస్టరుచికిత్స' చేయించుకోవాలి. అది పిచ్చిది కాకపోయినప్పటికీ 'పాస్టరుచికిత్స' చేయించు కోవటంవల్ల ప్రమాదం ఏమీ ఉండదు.

వైద్యనాథ రావు.

# వడదెబ్బ

చి. సౌ. సుశీలకు,

అబ్బ ! ఈమధ్య ఎండలు క్రమంగా ఎక్కువవుతున్నాయి. వడగాల్పులు వీచుతున్నాయి. శ్రీరామనవమి మరుచటిరోజున గుడివాడవద్ద ఇద్దరు వడకొట్టి చనిపోయారని వార్తాపత్రికలలో నీవు చదివేఉంటావు. మండువేసవి కాలపు ఎండలలో మనుష్యులు వడదెబ్బ తినడం మన దేశంలో పరిపాటే. మిట్టమధ్యాహ్నపువేళ ఎండలో తిరిగేవారికి వడకొట్టడం సహజమనుకోవచ్చును. కాని ఒక్కొక్కప్పుడు యింటిపట్టున ఉన్నవారికి కూడా వడకొడుతుంది. ఎండవేళకాకుండా సాయంకాలం 6–7 గంటల మధ్య వడకొట్టినవాళ్లను నేను చూచాను.

వడకొడుతే కొంతమందికి ముఖం ఎఱ్ఱపడుతుంది. బాగా జ్వరం వస్తుంది. ఇది ఒకరకం. వడకొట్టినపుడు కొందరు చాలా బలహీనంగా ఉంటారు. ముఖం పాలిపోతుంది. చర్మం చల్లగా ఉంటుంది. సామాన్యంగా ఉండవలసిన ఉష్ణతకన్నా రోగి ఉష్ణత చాలా తక్కువగా

ఉంటుంది. ఇది మరియొకరకం. ఈ లక్షణాల ననుసరించి మనం రోగికి చికిత్స చెయ్యాలి. లేకపోతే రోగికి మనం మేలుచేయడానికి బదులు కీడుచేసినవారం అవుతాం.

మొదటిరకం వడదెబ్బ ముందుగా చెప్పిరాదు. అంటే ముందుగా అది వచ్చే సూచనలు ఏమీ కనపడవు. రోగి తెలివితప్పి నేలమీద పడిపోతాడు. విశేషంగా నీరసిస్తాడు; కొన్నిగంటలలో చనిపోతాడు. ఈ వడదెబ్బ అంత విశేషంగా తగలనపుడు రోగికి మొదట తల తిరుగుతుంది. తరువాత తీవ్రమైన తలనొప్పి కలుగుతుంది; వాంతులు ప్రారంభిస్తాయి. నాడి స్ఫుటంగా ఉంటుంది. 106–107 డిగ్రీల జ్వరం వస్తుంది. కొంతమందికి ఆయాసం వస్తుంది, శ్వాసించలేక గుఱ్ఱుపెడతారు; తెలివి తప్పుతుంది; ఒకటి రెండురోజులలో వారు చనిపోతారు. ఇటువంటి వడదెబ్బ లక్షణా లున్నపుడు రోగికి మనం ఏంచెయ్యాలి? ముఖము, కళ్లు ఎఱ్ఱగా ఉండి, జ్వరం తీవ్రంగా ఉన్నపుడు మనం రోగి జ్వరాన్ని తగ్గించడానికి ప్రయత్నించాలి. వాని శరీరాన్ని తడిగుడ్డతో తడుపుతూ, తలకు మంచుముక్కను కట్టాలి. జ్వరం తగ్గిపోగానే రోగిని పరుపుమీద పరుండబెట్టాలి. తిరిగి జ్వరం వస్తే పైనచెప్పిన చికిత్సే మరల చేయాలి.

రెండవరకపు వడదెబ్బ తగిలినపుడు ఏంచెయ్యాలో యిక చెబుతాను. ఈ రోగికి ముఖం పాలిపోతుందనీ, చర్మం మిక్కిలి చల్లగా ఉంటుందనీ చెప్పానుకదూ! అట్టి వాని శరీరఉష్ణతను హెచ్చించడానికి మనం ప్రయత్నం చేయాలి. వానిగుండె చురుకుగా పనిచేసేటట్లు చూడాలి. వానికి వేడినీళ్ళతో కంఠస్నానం చేయిస్తూ తలకు చల్లని నీటితో తడిపిన గుడ్డ చుట్టాలి. లేదా ఆవగుండను వేడి నీటిలో కలిపి ఆ నీటిలో రోగిపాదాలను ఉంచి వేడికాఫీ గాని, టీ గాని అతనికి త్రాగడానికి ఇయ్యాలి. స్వతహాగా నీరసమైన గుండెకలవాడయితే, పై చికిత్స చేసిన పిమ్మట త్వరలో ఆ రోగిని డాక్టరుకు అప్పచెప్పాలి. వడదెబ్బ తిన్నవారిని రెండు, మూడు రోజులవరకూ మంచంనుండి కదలనీయరాదు. వారు పూర్తిగా విశ్రాంతి తీసికోవాలి.

అమ్మా! సుశీలా! వేసవికాలంలో వడదెబ్బ తగులకుండా ఉండడానికి ఇప్పుడు నీకు కొన్నిసూచనలను చేస్తాను. గాడ్పురోజులలో శరీరానికి అలసటకలిగించే పని చేయకు. పిల్లలను ఎండలో తిరగనివ్వకు. వేసవికాలంలో ధరించే దుస్తులు వదులుగా ఉండాలి; శరీరానికి చల్లదనం కలుగచేసేబట్టలే కట్టుకోవాలి. నీభర్త పనిమీద వీథిలోనికి వెళ్లేటప్పుడు 'దొరటోపీ' తప్పకుండా పెట్టుకోమని నా

మాటగా చెప్పు. ఆ టోపీ చాలా ఉపయోగకరమైనది. అది పెట్టుకొన్నవారికి తలకు, మెడకు సూర్యకిరణాలు తగులవు. వేసవికాలంలో తరుచుగా చల్లనినీరు త్రాగుతూ ఉండాలి. శరీరంనుండి చెమటరూపంలో విశేషంగా నీరు పైకి పోతూఉంటుంది. ఆ నీటిని భర్తీ చేయడానికి మన మావిధంగా నీరు త్రాగుతూ ఉండాలి. ఆ రోజులలో మనం హెచ్చుగా మసాలా వేసిన పదార్థాలు, విశేషంగా నూనెతో వండిన పదార్థాలు తినకూడదు. భోజనం తేలికగా చేయాలి. రసం బాగాఉండే కర్బూజా, నారింజ, టమాటా మొదలైన పండ్లు ప్రతిరోజూ తినడం మంచిది.

మీ పాపాయికి యిప్పుడు రెండోమాసం కదూ! ఆ పసిపాపను ఉయ్యాలలో పడుకోబెట్టి నిద్రపోతున్నాడు కదా అని ఊరుకోకు. చనుబాలో, చల్లని నీరో తరుచుగా పాపకు పడుతూ ఉండు. క్రిందటి వేసవిలో ఒక మాష్టరు గారి భార్య తన బిడ్డను గుడ్డఉయ్యాలలో మధ్యాహ్నం ఒంటిగంటవేళ పరుండబెట్టి నిద్రపోతున్నాడు కదా అని ఇంట్లో తనపనులు చేసుకుంటున్నది. నాలుగుగంట లయిన తరువాత పిల్లవాడు యింకా లేవలేదేమో అని ఉయ్యాల వద్దకు పోయి పిల్లవాడిని లేవతీసేటప్పటికి——ఏముంది వాడు కళ్ళు తెరవలేదు; కదలడు; మెదలడు. ఆ మాష్టరు

గారు వెంటనే నాకు కబురు చేశారు, నేను వెళ్లి చూశాను. కాని ఏమిప్రయోజనం! సుమారు గంటక్రితమే వాడు చనిపోయాడు. ఉయ్యాలలో ఉన్నది వారి పిల్లవాడు కాదని, అది ఒక కట్టెమాత్రమే నని వారితో చెప్పడానికి నే నెంత బాధపడ్డానో నీవు ఊహించుకో. పాప మాతల్లికి అదే మొదటి సంతానం. ఇంట్లో పెద్దదక్షత లేదు. పిల్లలను పెంచే పద్ధతులు ఆమెకు తెలియవు. అందుచేత ఆమె తన అల్లారుముద్దుబిడ్డను కోల్పోయింది.

ఆ విషాదసంఘటన తలచుకొంటే ఇంక కలం ముందుకు పోవడం లేదు. నీటిప్రమాదాన్నిగురించి వ్రాద్దామనుకున్నాను. ముందుమాటు వ్రాస్తానులే.

వైద్యనాథరావు.

# నీ టి గం డ ము

చి. సౌ. సుశీలకు,

నే నీమధ్య మీ మామయ్యగా రింటికి వెళ్లాను. వారు ఇల్లు కట్టుకొన్న తరువాత అదే మొదటిసారి నేను అక్కడకు వెళ్లడం. నేనూ, మీ మామయ్య, అత్తయ్య సావిట్లో కూర్చొని పిచ్చా పాటీ మాట్లాడుకుంటున్నాం. మాటలసందర్భంలో వాళ్ల మధు ఏడని అడిగాను. మధుసూదనుడు మూడేళ్లవాడైనా రణపెంకిగా తయారయాడని చెబుతూ వాడిని తీసుకురావడానికి పెరట్లోకి వెళ్లింది మీ అత్తయ్య. ఒక నిమిషంలో దొడ్లోంచి కెవ్వుమన్న కేక వినపడింది. మేము పోయి చూచేసరికి నీళ్ళకుండీవద్ద మీ అత్తయ్య నెత్తి మొత్తుకుంటూ ఏడుస్తోంది. ఆమెతోపాటు మీ మామయ్యకూడా ప్రారంభించాడు రోదనం. నేను కుండీ దగ్గరకు పోయి చూశాను. ఆ కుండీలోని నీళ్ళ అడుగున మధు పడి ఉన్నాడు. పిల్లవాడిని బైటకు తీశాను. వాడి శ్వాస ఆగిపోయింది. వాడి కేమీ ప్రమాదం లేదనీ, ఆమెను

ఓదార్చమనీ మీ మామయ్యతో చెప్పి పిల్లవాడికి చికిత్స చేశాను. 20 నిమిషాలలో వాడు బాగా శ్వాసించడం మొదలుపెట్టాడు. సుశీలా! ఆ దంపతుల ఆనందానికి అంతు లేదు. వారి పిల్లవాడిని ఆరోజున ప్రమాదం నుండి కాపాడటానికి నిజంగా ఆ పరమేశ్వరుడే నన్ను అప్పటికి పంపించాడనీ— లేకపోతే గృహప్రవేశానికైనా రానివాడిని ఆ రోజున మాత్రం ఎందుకువస్తాననీ— ఇలా కేవలం భట్రాజులలాగ నన్ను పొగడ్డం మొదలెట్టారు.

జరిగిన విషయం ఏమిటంటే—వారింటి కింకా కుళాయి పెట్టించుకో లేదు. అందుకని నీరు నిలువచేసికో డానికి పెరటిలో ఒక కుండీ కట్టించుకొన్నారు. ఆరోజున మధుకి ఆ నీళ్ళలో ఆడుకోవాలని కోరిక కలిగింది. మేము సావిట్లో మాట్లాడుకొంటూ ఉండటం చూచి వాడు కుండీ వద్దకు వెళ్లాడు. ఒక కాళీబిందెను కుండీదగ్గర బోర్లిం చాడు. దానిమీద కెక్కి— కుండీలోకి తొంగిచూడటంలో కాళ్ళు తేలిపోయి కుండీలో పడిపోయాడు. పాపం! వాడు నీళ్ళలో కొట్టుకుంటూ కేకలు వేసిఉంటాడు. మా మాటల సందడిలో అవి మాకు వినిపించలేదు.

నేను వారితో ఇలా చెప్పాను—"ఇంట్లో పసిపిల్లలు ఉన్నప్పుడు నీళ్ళకుండీ పైన మూత వేయకుండా ఉండకూడదు. పిల్లవాడు నీళ్ళలో పడిపోయినపుడు నెత్తి నోరూ కొట్టుకుంటూ కుండీచుట్టూ ప్రదక్షిణంచేస్తే ఏమీ ప్రయోజనం ఉండదు. ఇటువంటి ప్రమాదాలు రాకుండా ముందు జాగ్రత్తలు తీసికోవడమేకాకుండా అవి సంభవించినపుడు చేయవలసిన ప్రథమచికిత్సలను కుటుంబీకు లందరూ తెలిసికోవాలి."

నీటిలో ఉన్న చేపను తీసి గట్టుపైన పడవేస్తే అది చచ్చిపోతుంది. మనుష్యుడు నీటిలో మునిగిపోతే చచ్చిపోతాడు. దీనికి కారణం తెలుసా? చేప శ్వాసించడానికి దానికి 'మొప్పలు' అనే అవయవాలు ఉన్నాయి. అది వాటితో నీటిలో కరగియున్న ప్రాణవాయువును పీల్చుకొని శ్వాసిస్తుంది. గాలిలో ఉన్న ప్రాణవాయువును పీల్చుకొనుటకు మొప్పలు పనికిరావు. మనుష్యుడు శ్వాసించడానికి వానికి 'ఊపిరితిత్తులు' అనే అవయవాలు ఉన్నాయి. అతడు వాటితో వాతావరణంలో ఉన్న ప్రాణవాయువును పీల్చుకొని శ్వాసిస్తాడు. నీటిలో కరగి ఉన్న ప్రాణవాయువును పీల్చుకొనడానికి ఊపిరితిత్తులు పనికిరావు. మనుష్యుడు నిమిషానికి 15 సార్లు గాలిని ఊపిరితిత్తులలోనికి

పీల్చుకొని మళ్ళీ దానిని బైటకు వదలుతూ ఉంటాడు. గాలిని లోనికి పీల్చుకొనడం ఉచ్ఛ్వాసం, గాలిని బైటకు వదలటం నిశ్వాసం. ఈ ప్రాణవాయువు లేకపోతే మానవుడు బ్రతుకలేడు. మనుష్యుడు నీటిలో మునిగిపోయినపుడు ఊపిరితిత్తులలో గాలి ఉండవలసినస్థలంలోకి నీరు చేరుకుంటుంది. ప్రాణవాయువు లభించక అతడు చనిపోతాడు. నీటిలో మునిగిన మనిషి ఎంతసేపటిలో చనిపోతాడు? ఇది వ్యక్తినిబట్టి ఉంటుంది. కొంతమందికి నీటిలో మునిగిన అయిదు నిమిషాలకే ప్రాణం పోతుంది. మరికొందరు నీటిలో మునిగిన అరగంట వరకు ప్రాణంతో ఉంటారు. వారి శ్వాస ఆగిపోతుంది కాని వారి గుండెమాత్రం మందంగా కొట్టుకొంటూ ఉంటుంది. వాడిని చూస్తే చనిపోయాడనుకుంటాం. కాని వాడికి వెంటనే ఉచ్ఛ్వాసనిశ్వాసాలు కలిగిస్తే వాడు బ్రతుకుతాడు. ఈవిధంగా అతడికి మనం కలిగించే ఉచ్ఛ్వాస నిశ్వాసాలను 'కల్పితశ్వాసము' అంటారు.

నీటినుండి బైటకు తీసిన మనుష్యునికి ప్రథమ చికిత్స చేయడం ఎలాగో నీకు నికరంగా చెబుతాను. డాక్టరుకు వెంటనే కబురు పంపించు. శ్వాస ఆగిపోవడానికి కారణం వాడి ఊపిరితిత్తులలో నీరు చేరి గాలిని

లోనికి రానీయకుండా చేయడమే కదూ! కనుక మనము వెంటనే గాలిని ఊపిరితిత్తులలోనికి పంపించడానికి ప్రయత్నించాలి. మొదట ఊపిరితిత్తులలో నున్న నీటిని



ఊపిరితిత్తులనుండి నీటిని ఓడ్చివేయుట

బైటకు తీసివేయాలి. అందుకని రోగి పొట్టక్రిందికి నీచేతులను పోనిచ్చి పటములో చూపినట్లు పైకి లేవదీసి గట్టిగా చాలాసార్లు కుదుపు. అప్పుడు ఊపిరితిత్తులలో ఉన్న నీరు బైటకు వచ్చివేస్తుంది. స్థూలకాయుడయితే అతడిని ఈవిధంగా ఒకమనిషి లేవతీయడం సాధ్యం కాకపోవచ్చు.

అట్టివారిని పీపామీద అడ్డంగా బోర్లా పరుండబెట్టి వీపుపై నొక్కితే ఊపిరితిత్తులలోని నీరు బైటకు వచ్చివేస్తుంది. కొంతమంది రోగిని వెల్లగిల పరుండబెట్టి వాని పొట్టమీద నిలబడి తొక్కుతారు. అది చాలా ప్రమాదకరమైన పని. అందువల్ల రోగి లోపలి అవయవములు చితికిపోయి వానికి ఉపకారం కన్న అపకారం ఎక్కువగా జరుగుతుంది.

ఈ విధంగా ఊపిరితిత్తులనుండి నీరు బైటకు వచ్చివేసిన పిదప రోగిని బోర్లా పరుండబెట్టి వాని మొగమును ఒక ప్రక్కకు త్రిప్పి ఉంచాలి. పొడిగా ఉన్న చేతి రుమాలుతో అతని నాలుకను బైటకు లాగి ఉంచాలి. వాని



రోగిని బోర్లా పరుండబెట్టి వాని మొగమును ఒకప్రక్కకు త్రిప్పిఉంచాలి; మోకాళ్ళపై అతని ముఖమును చూస్తూ కూర్చుని, రోగి వీపు క్రిందిభాగమున ఇరుప్రక్కలను నీ రెండుచేతులను ఉంచి, నీభారమును ఆభాగమున మోపుచు వంగాలి.

బోమ్మ క్రిందిభాగమున ఒక పలుచని తలగడను గాని, గుడ్డచుట్టను గాని పెట్టాలి. పటములో చూపినటుల మోకాళ్లపై అతని ముఖమును చూస్తూ కూర్చొని రోగి వీపు



నీవు యథాస్థానమునకు వచ్చి ఆభారమును తీసివెయ్యాలి.

క్రిందిభాగమున ఇరుప్రక్కలను నీ రెండుచేతులను పటములో చూపిన విధముగా ఉంచి, నీ భారమును ఆ భాగమున మోపుచు వంగాలి. తరువాత నీవు యథాస్థానమునకు వచ్చి ఆ భారమును తీసివెయ్యాలి. ఈ విధంగా నిమిషమునకు 16 సార్లు చొప్పున చేసినచో కొంతసేపటికి రోగి స్వాభావికముగా శ్వాసించగల్గుతాడు. నీవు చేసే ఈ చికిత్స అతడి ఊపిరితిత్తులలోనికి గాలిని పంపడానికి అనే విషయం మరువకూడదు. అతని నోటిలో బురద, నీటిముక్కలు ఉంటే వాటిని ప్రారంభంలోనే తీసివేయాలి.

లేకపోతే గాలి లోనికి పోవడానికి, బైటకు రావడానికి అవి ఆటంకం కలుగచేస్తాయి. అతడికి త్వరగా శ్వాస రాక పోయినా నీవుమాత్రం నిరాశచెంది నీ ప్రయత్నం మాన కూడదు. రెండు గంటలసేపు కల్పితశ్వాసము సలిపిన పిదప స్వాభావికముగా శ్వాసించుటకు ప్రారంభించి బ్రతి కినవారుకూడా ఉన్నారు. నీ వింతప్రయాస పడినపిమ్మట మొదటిసారిగా రోగి ఊపిరిని తీసికొనినపుడు నీకు కలిగే ఆనందమునకు మేర ఉండదు. నీ కష్టము ఫలించినందుకు రెండుచేతులను జోడించి పరమేశ్వరునకు జోహారు లర్పిస్తావు.

తెలివి వచ్చి అతడు ధారాళముగా శ్వాసిస్తున్నపుడు వాని శరీరమును ఉన్నిబట్టలతో కప్పి, వేడినీటి సీసాలతో కాచి వెచ్చగ నుంచాలి. పిమ్మట వానికి వేడి కాఫీనిగాని, పాలను గాని ఇవ్వాలి.

వైద్యనాథరావు.

# విద్యుద్ఘాతము

చి. సౌ. సుశీలకు,

అది పాజ్జలలో ఉన్నంతసేపూ విద్యుచ్ఛక్తి మానవునకు ఎంత ఉపకారమైనా చేస్తుంది. కాని పొరపాటున విద్యుత్ ప్రవహిస్తున్న తీగను ఎవరైనా తాకితే వారికి ఘాతం కలుగుతుంది. అంటే వారి శరీరము లోపలి భాగముయొక్క జీవవ్యాపారాలు స్తంభించిపోతాయి. ఆ తీగతగిలిన దేహభాగము కాలి, పుండుకూడా పడవచ్చును. శ్వాస ఆగిపోతుంది. త్వరలో ఆ తీగను అతని దేహామునకు తగులకుండ చేయకపోతే ఆ వ్యక్తి చనిపోతాడు.

విద్యుత్ ఇస్త్రీపెట్టి, విద్యుత్ పొయ్యి మొదలైన విద్యుత్ పరికరాలలోనికి పోయే తీగలపైనున్న ఛాదనము కొన్నిచోట్ల పోయి యుండవచ్చును. అట్టి తీగను ఎవరైన ముట్టుకొన్నచో వారికి ప్రమాదం కలుగవచ్చును. అట్టి ప్రమాదంలో నున్నవారిని రక్షించుటకై ఆదుర్దాతో పోయి వారిని ముట్టుకొనరాదు. అట్లు చేసినచో ఎదుటివానిని

రక్షించుటకు బదులు తానుకూడ అదే ప్రమాదమునకే గురి యగును.

ఈమధ్య జరిగిన ఒక ప్రమాదాన్నిగూర్చి నీకు చెబుతున్నాను. మన ప్రక్కయింట్లో కాలేజీలో పని చేస్తున్న శాస్త్రోపాధ్యాయు లొకరు కాపుర మున్నారు. విద్యుత్‌శాస్త్రములో ఆయనది అందెవేసిన చేయి. ఒక రోజున ఆయన తమ్ముడు ప్రమాదవశమున విద్యుత్ ఘాత మునకు గురియైనాడు. వెంటనే అతడు కెవ్వుమని కేక వేసి నేలపై పడిపోయాడు. వాని చేతిలో ఆ తీగ ఉండి పోయింది. వెంటనే ఆ ఉపాధ్యాయుడు తన తమ్ముని రక్షించుకోవాలన్న ఆదుర్దాలో తన తమ్ముడిని పట్టుకొని దూరంగా లాగాలని ప్రయత్నించాడు. తన తమ్ముడిని అతడు తాకగానే వానినుండి విద్యుత్ తన శరీరముద్వారా భూమిలోకి ప్రవహించడం మొదలుపెట్టింది. వెంటనే ఇతడుకూడా నేలపై పడిపోయాడు. ఇంతలో ఆ యింట్లో ఉన్న ఆబాలగోపాలము ఒక్కపెట్టున ఏడుపు ప్రారం భించారు. నే నపుడు భోజనం చేస్తున్నాను. అసలుసంగతి ఏమిటో నాకు తెలియకుండా ఒక తృటిలో వారి యింట్లోకి పరుగెత్తాను. జరిగిన సంగతి అవగాహన చేసికొన్నాను. వెంటనే స్విచ్చిని నొక్కి తీగలలోనికి విద్యుత్ పోకుండా

ఆపివేశాను. ఇంతలో మొదట ఘాతముతిన్న తమ్ముడికి తెలివి వచ్చింది. అన్నగారికి తెలివి రాలేదు సరికదా ఆయన శ్వాస ఆగిపోయింది. ఆయన శరీరం నీలిరంగుగా మారిపోయింది. నేను వెంటనే ఆయనను బోర్ల పరుండ బెట్టి కల్పితశ్వాసాన్ని ఇవ్వడం ప్రారంభించాను. 15 నిమిషములకు ఆయన తనంతట తాను శ్వాసించడం మొదలు పెట్టాడు. తరువాత పూర్తిగా తెలివి వచ్చింది.

మన ప్రభుత్వం ప్రణాళికలద్వారా గ్రామ గ్రామాలకు విద్యుత్‌ను సరఫరా చేస్తున్న ఈరోజుల్లో ప్రతివ్యక్తి విద్యుద్ఘాతమునుగూర్చి, అది కలిగినపుడు చేయవలసిన ప్రథమచికిత్సనుగూర్చి తెలిసికోవడం ఎంతైనా అవసరం.

విద్యుత్ ప్రవహిస్తున్న తీగను తాకుతూ ఒకడు స్పృహతప్పి నేలపై పడి ఉన్నాడనుకొందాము. ఎక్కువ పీడనము గల విద్యుత్ వానిగుండా ప్రవహిస్తోందని మనం నిశ్చయించుకోవాలి. లేకపోతే వాడికి తెలివి తప్పియుండదు. అప్పుడు మనం ఏం చెయ్యాలి ? డాక్టరుకు వెంటనే కబురు పంపించాలి. తరువాత ? ప్రధానమైన స్విచ్చి ఎచ్చటనున్నదో మనకు తెలిస్తే వెంటనే ఆ మీటను నొక్కి విద్యుత్ ప్రవాహాన్ని అరికట్టాలి. అది సాధ్యం కానపుడు తీగనుండి వానిని తప్పించాలి. విద్యుత్ ప్రవహిస్తున్న

వస్తువును కాని, మనుష్యుని కాని మనం తాకితే ఆ శక్తి మన శరీరంగుండాకూడ ప్రవహిస్తుంది. మనం నేలమీద నిలబడి ఆపని చేస్తే విద్యుత్ మరీ విపరీతంగా మన దేహం గుండా నేలలోకి ప్రవహిస్తుంది. అప్పుడు మనం ఘోర మైన ప్రమాదానికి లోనవుతాము. కనుక వానికి తగులు



విద్యుత్తు ప్రవహిస్తున్న తీగను తాకుతూ ఒకడు స్పృహతప్పి నేలపై పడియున్నాడు. తీగనుండి వానిని తప్పించాలి. తీగనుండి వానిని తప్పించేటప్పుడు విద్యుత్తు మన శరీరంలోకి ప్రవహించకుండా కాపాడుకోవాలి.

తున్న తీగను తీసివేయడానికి ముందు మన శరీరంలోనికి ఆవిద్యుత్ ప్రవహించకుండా కాపాడుకోవాలి. పొడిగాఉన్న బల్లచెక్క, కోటు, పుస్తకాలు, వార్తాపత్రికల కట్ట, రబ్బరు అట్ట, దళసరి గాజుపలక—ఇలాంటివానిలో ఏదో ఒకదాని పైన నిలబడి కఱ్ఱతో అతని శరీరమును ప్రక్కకు త్రోసి వెయ్యాలి. లేదా కోటునో, నూలు త్రాటినో తీగక్రిందకు జొన్పి తీగను మన చేతులతో తాకకుండా దానిని పైకి ఎత్తాలి. వీలైతే కఱ్ఱపిడి గల గొడ్డలితో ఆ తీగను ఇరువైపుల తెగగొట్టవచ్చును. నీటిగుండా విద్యుత్ ప్రవహిస్తుంది కనుక పైవస్తువులన్నీ పొడిగా ఉండటం అత్యావసరం. లోహపువస్తువులతో ఎన్నడూ విద్యుత్ ప్రవహిస్తున్నతీగలను తాకరాదు. ఈ నియమాలను మనం పాటించినపుడు విద్యుత్ అంటే మనం భయపడనవసరం లేదు.

తీగను తప్పించిన పిదప అతడిని వెంటనే మనం తాకవచ్చును. తరువాత అతని బట్టలను సడలించి, నోటిని తెరచి, నాలుకను ముందుకు లాగవలెను. తరువాత నీట మునిగి శ్వాస ఆగినవానికి చేయునట్లు కల్పితశ్వాసం ఇవ్వాలి.

వైద్యనాధరావు.

# పా ము కా టు

చి. సౌ. సుశీలకు,

నలభైసంవత్సరముల క్రితం మీ తాతగారు అడవుల తనిఖీకి బయల్దేరి సంతోషపురం అనే గ్రామంలో బంగాళాలో బసచేశారు. ఆయనకు 'పులివేట' అంటే సరదా. ఆ రాత్రి కొందఱు రైతులు ఆయనవద్దకు వచ్చి ముందురోజున పులి యొక ఆవును చంపిందనీ దాని కళేబరంవద్దకు మళ్లీ ఆ పులి ఆ రాత్రి తప్పకుండా వస్తుందనీ దానిని తుపాకీతో కాల్చవలసిందనీ ఆయనను కోరారు. దానికి ఆయన అంగీకరించి వారు ఏర్పాటుచేసిన మాటువద్దకు తమ నౌఖరులతో బయల్దేరి వెళ్లుచుండగా త్రోవలో వారిని త్రాచుపాము కరిచింది. సుశీలా! ఆ పరిస్థితి నీవొకసారి ఊహించుకో. అర్ధరాత్రి – నట్టడవి – త్రాచుపాము కరవడం.

మీ తాతగారు అటవీశాఖలో పనిచేసే ఆఫీసరు అవడంవల్ల ప్రథమచికిత్సాపద్ధతులలో బాగా తరిఫీదు పొందారు.

అప్పుడు వారి జేబులో ఒక చిత్రమైన చాకు ఉంది. అది చాల పదునైనది. దాని పిడి గుల్లగా ఉంది. దానిలో పొటాసియముపర్మాంగనేటు అనే మందు ఉంది. ఈ మందు కారిపోకుండా ఆ పిడి కొక మూత ఉంది. అప్పుడాయన స్వంతంగా ప్రథమచికిత్స చేసికొన్నారు. ఆయన తమ మొలత్రాడు కోసి కాటుపైన కట్టు కట్టి కాటువద్ద చాకుతో నిలువుగా ఒక అంగుళము పొడుగునా నాట్లు పెట్టి రక్తమును బాగుగా పిండివేశారు. తరువాత గాయంలో పొటాసియంపర్మాంగనేటును వేసి రుద్దారు. ఈవిధంగా పాము కరచినతక్షణం చికిత్స చేసికొనడంవల్ల ఆయనకు ప్రాణాలు దక్కాయి.

హిందూదేశంలో ఏటా 20,000 మంది పాముకాటు వలన చనిపోతున్నారు. చాలా పాములు విషం లేనివే. విషసర్పాల సంఖ్య తక్కువ. రంగుని చూచి ఒక పాము విషం గలదా ? లేదా ? అని నిర్ణయించలేము. కొన్ని విషం లేనిపాములు, విషం ఉన్నపాములవలె కనపడతాయి. మన యిండ్లలోనికి తరుచుగా వచ్చే నీటికట్టు యిటువంటిదే. దీనికి విషం లేదు. దానిపై కట్లు ఉండడం చేత చాలమంది అది కట్లపాము అని భ్రమపడతారు.

త్రాచుపాము (నాగుబాము), కట్లపాము, పొడ పాము—ఇవి మనదేశంలో ఉన్న ముఖ్యమైన విషసర్పాలు.



త్రా చు పా ము

నాగుబామును అందరూ సులభంగా పోల్చుకుంటారు. దానికి పడగ ఉంటుంది. దానిమీద విష్ణుపాదాలు ఉంటాయి. కట్లపాము నల్లగా తళతళలాడుతూ ఉంటుంది. దాని



క ట్ల పా ము

శరీరంమీద అడ్డంగా తెల్లని చార లుంటాయి. పొడ పాములకు మచ్చ లుంటాయి. ఈ రకమైన వాటిని తివాసి పొడ, కాటుకపొడ అంటారు. పొడపాము తలమీదనున్న



పొ డ పా ము

పొలుసులు చాల చిన్నవి. దాని వీపుపొడుగునా మధ్య భాగంలో ఉన్న పొలుసులు పెద్దవిగా ఉంటాయి. ఈ పాముకు ప్రత్యేకంగా సన్నని మెడ ఉంటుంది. సాధార

ణంగా తలమీద చిన్నపొలుసులు, పొట్టమీద పెద్దపొలు సులు ఉంటే ఆ పాములు విషంగలవని మనం నిశ్చయించు కోవచ్చును.

విషసర్పం తలలో పైదౌడయందు రెండువైపుల చెరియొక విషపుగ్రంధి ఉంటుంది. ప్రతి గ్రంధినుండి ఒక విషనాళం బయల్దేరి చెరియొక విషపుకోరలోను అంత మవుతుంది. ఈ విషపుకోర వైద్యులు ఇంజక్షను చేయుట




పాము విషావయవములు – విషముగల పాముకాటు

1. విషగ్రంధి 2, విషనాళము

3. కోర 4. వెనుకకు వంగిన పండ్లు

●● కోరలచే చేయబడిన గాయములు

కుపయోగించే సూదివలె పనిచేస్తుంది. విషసర్పము ఏ జంతువునైనా కరచినపుడు దాని కోరలు ఆ జంతువు శరీరంలో గుచ్చుకుంటాయి. అప్పుడు విషగ్రంధులలో ఉన్న విషం, విషనాళములద్వారా కోరలలోనికిని, వానిద్వారా అది కరచిన జంతువుయొక్క శరీరంలోనికిని ప్రవేశిస్తుంది. పామువిషాన్ని గరళం అంటారు. ఇది చాల అపాయకరమైనది. దీన్ని ఆయుర్వేద వైద్యులు మందులలో వాడతారు. ఆ మందులు అమోఘంగా పనిచేస్తాయి. అయితే యీ గరళం శరీరంలో ఏభాగంలోనూకూడా రక్తంలో ప్రత్యక్షంగా కలవకూడదు. అలా కలిస్తే ప్రమాదం.

విషసర్పముయొక్క నోటిలో కోరలే కాక సాధారణమైన పండ్లుకూడా ఉంటాయి. విషం లేని పాముల నోటిలో కోర లుండవు. పటములలో చూడు. వానిలో పొడపాము కరచినపుడు చర్మముపైన కనబడే గుర్తులు, విషం లేని పాము కరవడం వలన ఏర్పడే గుర్తులు సూచించాను.

త్రాచుపాము కరవగానే, కరచినచోట కాలినట్లు మండుతుంది. తరువాత అచ్చట తిమ్మిరిగా ఉంటుంది. షిదప ఆ భాగం వాస్తుంది. కోరల కాటువలన ఏర్పడిన రంధ్రాలనుండి ఎఱ్ఱని ద్రవం కారడం ప్రారంభిస్తుంది.

కాటుపడినవాడు నీరసపడతాడు; కాళ్లమీద నిలబడలేడు; క్రింద కూలపడతాడు. క్రమంగా వాడి అవయవములు



విషములేని పాముకాటు

ఈపామునకు కోరలుండవు

కనుక కోరలచే చేయబడిన గాయములు లేవు

స్వాధీనం తప్పుతాయి. కదలలేడు, మాట్లాడలేడు, మ్రింగ లేడు. నోటివెంబడి నురగలు కారుతాయి. ఇంతగా నీర సించినా, వాడికి తెలివిమాత్రం తప్పదు. వాడు వాంతి కూడా చేసికోవచ్చును. శ్వాసక్రియ క్రమంగా తగ్గి తుదకు ఆగిపోతుంది. సాధారణంగా పాము కరచిన 12 గంట లలో చనిపోతాడు. రెండురోజులవరకు బాధపడి చనిపో

యినవారుకూడ ఉన్నారు. రక్తంలోకి విషం ఎక్కువగా పోతే త్వరగా చనిపోతాడు, తక్కువగా పోతే ఆలస్యంగా చనిపోతాడు.

త్రాచుపాము కరిస్తే ఏ లక్షణాలు కనపడతాయో కట్లపాము కరిస్తేకూడ అవేలక్షణాలు కనపడతాయి. అంతే కాదు. కట్లపాము కరచినవానికి కడుపులో భరింపలేని నొప్పికూడా కలుగుతుంది.

పొడపాము కరచినవానికి లక్షణాలు ఇంకోవిధంగా ఉంటాయి. పాము కరచినచోట వాపు, నొప్పి ఉంటాయి. కాని ఆ వాపు క్రమంగా చుట్టుప్రక్కలకు వ్యాపిస్తుంది. వాని అవయవములు స్వాధీనం తప్పిపోవు. శరీరమంతా చెమటలు పోస్తాయి; చల్లపడుతుంది. రక్తంలోకి విషం జాస్తీగా వెళ్లినట్లయితే త్వరగా గుండె ఆగిపోయి చనిపోతాడు. శరీరంలోకి విషం జాస్తీగా పోకపోతే శరీరం లోపలిభాగములనుండి పండ్ల యిగుళ్ళనుండి కొన్నిరోజుల వరకూ రక్తం కారుతూ ఉంటుంది. లోపలి కెక్కిన విషాన్నిబట్టి కొన్నిగంటలలోనో లేదా ఒక వారంలోనో చనిపోతాడు. ఈ సందర్భంలో ఒక్కవిషయం జ్ఞాపక ముంచుకోవాలి. పాముయొక్క విషం ఎంత అపాయకర మైనదైనా మెల్లగా పనిచేస్తుంది. కనుక పాము కరచిన

వాడు వెంటనే తెలివితప్పి పడిపోడు. ఒకవేళ అలా ఎవరైన స్పృహతప్పి పడిపోతే దానికి కారణం అతనికి కలిగిన విపరీతమైన భయమే.

ఇపుడు పాముకాటుకు చేసే ప్రథమచికిత్సను గురించి చెబుతాను. గాయంలోని విషం రక్తంలోకి ఎక్కి శరీరంలోపలి అన్ని భాగాలకు పోకుండా చేయాలి. ఒకనికి చేతిమీద గాని, పాదంమీద గాని పాము కరచింది అనుకుందాం. వెంటనే కాటుకు పైన అనగా వాని గుండెకు, కాటుకు మధ్య బిగింపుకట్టు కట్టాలి. ఈ పనికి మొలత్రాడును కాని, పంచెఅంచును చింపి దానిని కాని, చేతిరుమాలును కాని, బెల్టును కాని ఉపయోగింపవచ్చును. ఈ బిగింపుకట్టును 15 నిమిషముల కొకసారి సడలించాలని ఇదివరలో నీకు వ్రాసిన విషయం మరచిపోకూడదు. లేనిచో ప్రమాదం సంభవిస్తుంది సుమీ!

తరువాత గాయమును వేడినీటితో గాని, పొటాసియంపర్మాంగనేటును కరిగించిన నీటితోగాని బాగుగా కడగవలెను. గాయమును కడుగుటవలన గాయముచుట్టూ చర్మంపై ఏమైన విషముంటే అది నీటితో కొట్టుకుపోతుంది. లేకపోతే ఆ విషంకూడా గాయంలోకి వెళ్ళడానికి అవకాశం ఉంటుంది.

పిమ్మట కాటుమీద నిలువుగా అంగుళం పొడుగు, అరఅంగుళం లోతు ఉండేటట్లు చాకుతో నాట్లు పెట్టి రక్తము బాగా పిండివెయ్యాలి. గాయంనుండి రక్తాన్ని నీ నోటితో పీల్చి ఉమ్మివేయవచ్చును. అందువలన నీ కేమీ ప్రమాదం కలగదు. తరువాత నోటిలో నీరుపోసికొని పుక్కిలించి ఉమ్మివేయవచ్చును. కాని నోటిపూత ఉన్నపుడు, నోటిలో పుండు ఉన్నపుడుమాత్రం ఈపని చెయ్యరాదు. మనం ఈవిధంగా చేయడంచేత గాయంలో నున్న విషం చాలవరకు బైటకు పోతుంది. తరువాత పొటాసియంపర్మాంగనేటుస్ఫటికములను గాయములో వేసి రుద్దవలెను. ఇంకా ఏమైనా కొద్దివిషం గాయంలో మిగిలితే దాన్ని పొటాసియంపర్మాంగనేటు విరిచివేస్తుంది.

ఇంతేకాదు. నీవు చేయవలసిన పని మరియొకటి ఉంది. పాముయొక్క విషానికి విరుగుడు ఇప్పుడు ప్రతి ఆస్పత్రిలోను దొరుకుతుంది. దీనిని డాక్టరు సూదితో రక్తంలోకి ఎక్కిస్తారు. త్రాచుపాము, పొడపాముల విషములనుమాత్రమే ఈ మందు విరిచివెయ్యకలదు. ఈ విరుగుడును 'ఆంటివెనిన్' అంటారు. కట్లపాము విషానికి యింకా విరుగుడు తయారుకాలేదు. పాము కరచిన వానికి నీవు చేయవలసిన చికిత్సను చేసినపిదప అతనిని

దగ్గఱగానున్న ఆస్పత్రికి తీసుకుపోయి 'ఆంటివెనిన్' ఇప్పించాలి.

పాము కరచినపుడు పైనచెప్పిన చికిత్సను చేయకుండా మంత్రాలు, మణులు, నాటుమందులు—వీనిమీద ఆధారపడి ఉండటం వట్టి అవివేకం. ఇవి ఏవీ పాము కాటుకు ఉపయోగపడవని పూర్తిగా రుజువైనవి. విష సర్పం కరచినవారందరూ చనిపోరు. ఒకవ్యక్తిని పాము కరవడానికి పూర్వం అది మరియొకజంతువును కరచి ఉండవచ్చును. అందుచేత దానివిషం అంతా ముందుగానే ఖర్చైపోతుంది. లేదా అది కాటువేయడానికి మన దేహభాగం అనువుగా ఉండకపోవడంచేత దానికోరలు లోతుగా దిగకపోవచ్చును. అది కాటువేసినచోటున బట్ట ఉంటే దానికోరలద్వారా కారిన విషం ఆ భాగానికి పైన ఉన్న బట్ట పీల్చివేసి యుండవచ్చును. అలాంటప్పుడు గాయంలోకి ఎక్కువ విషం పోకపోవడంవలన కరచిన చోటున కొంత బాధ కలిగినప్పటికీ ఆ వ్యక్తికి ప్రాణాపాయంమాత్రం కలుగదు. అట్టివారు బ్రతికినపుడు అసలు దానికి కారణం ఏదో తెలిసికోక వారిపై ఉపయోగించిన మంత్రాలు, మణులే వారు బ్రతకడానికి కారణం అని అమాయకులు భావిస్తారు.

ఇంకో ముఖ్యమైన మాట చెప్పి యీ ఉత్తరం ముగిస్తాను. ఒక్కొక్కప్పుడు విషంవలన కాక భయం వలన పాము కరచినవారు చనిపోతారు. కనుక వారు పామును చూచిఉండకపోతే వారిని కరచినది విషసర్పము కాదని వారికి ధైర్యము చెప్పాలి. వారి కాసర్పమును గురించి తెలిస్తే నీవు చేసే ప్రథమచికిత్సవలన అతడు తప్పకుండా తేరుకుంటాడని ధైర్యం చెప్పాలి. మిగిలిన వారుకూడా ఈవిషయంలో బాగా దోహదం చెయ్యాలి.

వైద్యనాథరావు.

# ఎముకలు విరుగుట

చి. సౌ. సుశీలకు,

ఈమధ్య ఒక రోజున కొంతమంది పిల్లలు మన ఊరివెలుపల మామిడితోటలో కోతికొమ్మచ్చి ఆడుతున్నారు. అందులో ఒకడు చెట్టుమీదనుండి క్రింద పడ్డాడు. వాడి చేతిలోని ఎముక విరిగింది. దాని కొనలు చేతిలోపలనే ఉన్నాయి. ఇంతలో ప్రక్కనున్న మరియొక కుఱ్ఱవాడు క్రిందపడ్డవాడిని చేయి పట్టుకొని పైకి లేవతీశాడు. అప్పు డావిరిగిన ఎముకకొనలు చుట్టున ఉన్న కండరములను, చర్మమును దూసుకొని పైకి వచ్చాయి. ఈవిధంగా ఆ స్నేహితుడు వాడిపాలిటి శత్రువై గోటితో పోయేదానికి గొడ్డలిదాకా తెచ్చాడు. ఏదైనా ప్రమాదం సంభవించినపుడు ప్రక్కనున్నవారు ఎంత మెలకువగ ప్రవర్తించాలో నీ కిప్పుడు అవగాహన అయిఉంటుం దనుకుంటాను.

ఎముక మూడువిధాలుగా విరుగుతుంది. అది ఒక ప్రక్కన బీటతీసి రెండవప్రక్కన తగుమాత్రం వంగి యుండవచ్చును. పిల్లల ఎముకలు సాధారణంగా ఇలా



ఎముక

పైవైపున విరిగినది
క్రిందివైపున వంగినది

విరుగుతాయి. ఎముక పూర్తిగా విరిగి అవయవములోపలనే ఉండిపోవచ్చును. ఒక్కొక్కప్పుడు ఆ పిల్లవానికి



ఎముక విరిగి ముక్కలు లోపల ఉండిపోయినవి



విరిగిన ఎముక కండను, చర్మమును దూసికొని పైకి వచ్చినది

జరిగినట్లు విరిగిన ఎముకకొనలు చుట్టునున్న కండరము లను చర్మమును చీల్చుకొని వెలుపలకు రావచ్చును.

ఎముక విరిగిందీ లేనిదీ ఏలాగున తెలిసికోడం? ఎముక విరిగినభాగం వాస్తుంది. నొప్పిగా ఉంటుంది. ఆ భాగం రూపం మారుతుంది. అది పొడుగులో తగ్గ వచ్చు; లేదా మెలిపడవచ్చు; లేదా ఆ భాగంలో వంపు రావచ్చును. ఆ భాగాన్ని మెల్లగా కదిపితే ఎముక విరి గినచో కొనలరాపిడి యుండును. దానినిబట్టి ఎముక విరిగినట్లు సులభముగా గ్రహించవచ్చును.

ఎముక విరిగినపుడు మొదట మనము ఏం చికిత్స చెయ్యాలో ఇప్పుడు చెబుతాను. ఆ విరిగిన ఎముక కొనలు వాటి చుట్టుననున్న మృదువైన కండరముల లోనికి చొచ్చుకొనిపోకుండా జాగ్రత్త తీసికోవాలి. అందులకు విరిగిన ఎముకకొనలను కదలకుండా చెయ్యాలి. ఎముక విరిగిన భాగాన్ని మెల్లగా జాగ్రత్తగా సాగతీయాలి. చర్మంపైన గాయం లేకపోతే ఆ భాగమును కప్పిన దుస్తులను విప్పనవసరము లేదు. దుస్తులను విప్పుటకు ప్రయత్నిస్తే అతనికి వృథాగా శ్రమ కలుగుతుంది.

తరువాత కఱ్ఱబద్దలు, దళసరి అట్టముక్కలు, గొడుగుకామలు, చుట్టపెట్టిన వార్తాపత్రికలు, చీపురుకట్టలు—



డాక్టరు వచ్చేలోగా విరిగిన ఎముకను
కట్టుట

ఇటువంటివాటిలో సమయానికి అందుబాటులో నున్నవానిని అవయవమునకు చేర్చి గుడ్డపేలికలతో గట్టిగ కట్టవలెను. లోపలనున్న ఎముకలు కదలకుండ నుండునంత బిగువుగమాత్రమే కట్లు కట్టవలెను.

పైన పేర్కొన్నవస్తువు లేవియు దొరకనిచో ఈ క్రిందివిధముగ కట్టు కట్టవచ్చును. చేతిలోని ఎముక విరిగినచో ఆ చేతిని సాగదీసి కదలకుండ వాని మొండెమునకు గుడ్డలతో కట్టివేయవచ్చును. విరిగినది కాలిలో ఎముక అయినచో ఆ కాలిని జాగ్రత్తగ సాగదీసి వాని

రెండవకాలికి కదలకుండ నుండునటుల గుడ్డలతో కట్టి వేయవచ్చును. పిదప వానికి వేడికాఫీ గాని, పాలను గాని యిచ్చి ధైర్యము చెప్పుచు నిస్త్రాణ రాకుండ చూడవలెను.

వెంటనే వైద్యుని పిలిపింపుము. లేదా అతనిని ఎత్తి మంచము, చాప, దుప్పటీ— వీటిలో ఏదో ఒక దానిపై పరుండబెట్టి వైద్యునివద్దకు గొనిపొమ్ము.

వై ద్య నా థ రా వు.

# విషప్రయోగము

చి. సౌ. సుశీలకు,

మందు అనుకొని పొరపాటున రోగులు విషం త్రాగవచ్చును. విషం గల సీసా పిల్లలకు అందు బాటులో ఉంటే వాళ్ళు దానిని తీసికొని త్రాగవచ్చును. కొంతమంది యింటిలోని పోరు పడలేకనో, వ్యాధిబాధ భరింపలేకనో, పేదరికమువలననో, జీవితముపై విసు గెత్తి విషం త్రాగుతారు. అటువంటప్పుడు విషప్రయోగం జరిగిందని డాక్టరుకు వెంటనే మనం కబురుచేయాలి. డాక్టరు వచ్చేలోగా నీవు చేయవలసిన పనులను చెబు తాను; జ్ఞాపక ముంచుకో.

విషం త్రాగినవాని ప్రక్కన గ్లాసు, పొట్లములు, కాగితములు ఉన్నయెడల వాటిని పరిశీలించాలి. డాక్టరు వాటిని పరిశీలించుటకొరకు అతడు వచ్చువరకు వాటిని జాగ్రత్తపెట్టాలి. విషం త్రాగినవాని నోటిని జాగ్రత్తగ పరిశీలించాలి. వాని ఊపిరిని వాసనచూడాలి. దానివలన

అతడు తీసికొన్న విష మేదో నిర్ణయమైతే, దాని విరుగు డేదో నీకు తెలిస్తే, వెంటనే ఆ విరుగుడును యియ్యాలి.

డాక్టరు వచ్చేలోగా ముఖ్యంగా చేయవలసినపని ఒకటుంది. విషం త్రాగినవానిచేత త్వరగా వాంతిని చేయించాలి. దీనివలన అతడు పుచ్చుకొన్న విషంలో చాల భాగం పైకి వచ్చివేస్తుంది. ఒక గ్లాసు నీళ్ళలో రెండు పెద్దచెంచాల ఉప్పు వేసి కరగించి దానిని అతనిచే మ్రింగించాలి. దానివలన వాంతి అవుతుంది. త్వరగా వాంతి కాకపోతే వాంతి అయేవరకు తిరిగి యిస్తూ ఉండాలి. ఒక గ్లాసు వేడినీటిలో రెండు చిన్నచెంచాల ఆవగుండను కలిపి వానిచే త్రాగిస్తేకూడా వాంతి అవుతుంది. ఈ వాంతిని డాక్టరు వచ్చేవరకు జాగ్రత్త పెట్టాలి.

ఇచట నీవు ముఖ్యంగా జ్ఞాపకముంచుకోవలసిన విషయం ఒకటి ఉంది. విషం త్రాగినవాని నోరు, పెదవులు పుండుపడి ఉంటే వానికి వమనకారి యీయరాదు.

కొన్ని విషాలు, వాటిని మ్రింగినపుడు కనపడు లక్షణాలు, ఆ విషాలకు విరుగుళ్లు—వీటినిగురించి యిప్పుడు వ్రాస్తాను.

సల్ఫ్యూరికు, హైడ్రోక్లోరికు, నైట్రికుఆమ్లములను మ్రింగితే వానికి నోటివద్దనుండి ఆసనమువరకూ పుండు

పడుతుంది. కడుపులో విస్తారముగా మంట బయల్దేరు తుంది. అట్టివానికి వమనకారి యీయకూడదు. సుద్దనో, గోడను ఉండే సున్నపుపెచ్చులనో గుండచేసి నీటిలో కలిపి దానిని వానిచేత త్రాగించాలి.

నల్లమందు మ్రింగితే రోగికి నిద్ర ముంచుకొస్తుంది. కంటిపాపలు సంకోచిస్తాయి. శ్వాస మందగిస్తుంది. ఆ శ్వాస నల్లమందువాసన కొడుతుంది. అట్టివానిచేత వాంతిని చేయించాలి. బాగా ఎఱ్ఱరంగు వచ్చేవరకు నీటిలో పొటాసియముపర్మాంగనేటును కలిపి ఆ ద్రావణమును వానిచే త్రాగించాలి. వానిని నిద్రపోనీయకూడదు. వానిచే ముందువెనుకలకు పచారు చేయించాలి; చిక్కని కాఫీని త్రాగడాని కియ్యాలి. తెలివి తప్పుతూ ఉంటే వాని ముఖము మీద చల్లని నీటిని చల్లాలి; వీపుపై చేతితో తరుచుగా తడుతూ వాడు మెళకువగా ఉండేటట్లు చేయాలి. శ్వాస ఆగిపోతూఉంటే కల్పితశ్వాసం ప్రారంభించాలి.

ఉమ్మెత్తగింజలను మ్రింగితే వాని గొంతు ఎండి పోతుంది; ముఖం ఎఱ్ఱపడుతుంది. కంటిపాపలు పెద్ద వవుతాయి; గుటకలు వేయడానికి కష్టంగా ఉంటుంది. తెలివి తప్పుతుంది. పరాకుమాటలు వస్తాయి; తుదకు గుండె ఆగిపోయి చనిపోతాడు. ఈ విషం త్రాగినవానిచే

వాంతి చేయించాలి; ముఖంపై చల్లనినీటిని కొడుతూ ఉండాలి; వేడి కాఫీని త్రాగుట కీయాలి.

నాభిని తిన్నవానికి విదాహం కలుగుతుంది. శరీర మంతా తిమ్మిరిగా ఉంటుంది. నాడి, శ్వాసకూడ సన్న గిల్లుతాయి. వానికి వాంతికి ఉప్పుద్రావణం యియ్యాలి; వేడి కాఫీని యిచ్చి వానికి చురుకుదనం కలిగించాలి. వేడినీటి సీసాలతో శరీరం కాచాలి. దీనివలన తిమ్మిరి బాధ తగ్గుతుంది. శ్వాస ఆగిపోతే కల్పితశ్వాసము కలుగచేయాలి.

ఉల్లిపాషాణం మ్రింగుతే కడుపులో విపరీతమైన మంట పుడుతుంది; వాంతులు, విరేచనాలు ప్రారంభిస్తాయి. వాటిలో రక్తపుజీర లుంటాయి. కండరాలు తిమ్మిరెక్కు తాయి. వానికి వెంటనే వమనకారి నియ్యాలి. కోడి గ్రుడ్డులోని తెల్లని సొనను, వేడినేయిని త్రాగడాని కియ్యాలి. నిస్త్రాణ కలిగితే వేడినీటిసీసాలతో దేహ మును కాచి వేడికాఫీని త్రాగించాలి.

కెరొసీనును త్రాగితే వానిచేత పాలను, మంచి నూనెను, ఆముదమును త్రాగించాలి. ఆముదమువలన విరేచనా లవుతాయి. ఆ విరేచనాలలో కెరొసీను బైటకు పోతుంది.

త్రాగినవిషం ఏదో నీకు నిశ్చయంగా తెలియక పోతే వానికి గ్రుడ్లయందలి సొన, పాలు, చిక్కని తేనీరు త్రాగుట కియ్యాలి. ఈ పానీయాలు వానికి హాని చేయవు. కొన్ని విషాల కవి విరుగుళ్లుగాకూడా పని చేస్తాయి.

వైద్యనాధరావు.

# కా ల్పు లు

చి. సౌ. సుశీలకు,

శరీరమునకు నిప్పు తగిలినపుడు చర్మము కాలుతుంది. నిప్పులో కాలిన గరిటె, గిన్నె మొదలగునవి తాకినపుడు మన చర్మం కాలుతుంది. వీనివలన కలిగిన గాయాలను 'కాల్పులు' అంటారు. సల సల కాగుచున్న నీరు, నూనె, గంజి మొదలగు పదార్థాలు మన శరీరంపై పడినపుడు చర్మం కాలి, పొక్కు లెక్కుతాయి. ఈ పొక్కులను 'బొబ్బలు' అంటారు.

ఇటువంటి ప్రమాదములు కలిగినపుడు రోగికి ధైర్యం చెప్పాలి. కాలినపుండ్లపై అంటుకొని ఉండే గుడ్డలను అట్లే ఉంచి చుట్టూ ఉండే భాగాలను జాగ్రత్తగా కత్తిరించి తీసివేయాలి. కాలిన చర్మమును పీకివేయకూడదు. బొబ్బలను చిదుపకూడదు. సున్నపు తేటను కొబ్బరినూనెను సమభాగములు చేర్చి గిలకొట్టినచో వెన్నవలె ముద్దగా అవుతుంది. దీనినే నవనీతం అంటారు.

ఈ నవనీతముతోతడిపిన గుడ్డతో గాని, దూదెతో గాని పుండ్లను కప్పి ఉంచాలి. లేదా నీటిలో తేయాకును వేసి, బాగుగ మరగనిచ్చి, ఆ నీటిని చల్లార్చి దానిని పుండ్లపై పోసి పరిశుభ్రమైన దూదితో పుండ్లను కప్పిఉంచాలి. అందువలన గాలిలోని సూక్ష్మజీవులు పుండ్ల కంటకుండ కాపాడు పొర ఒకటి పుండ్లపై ఏర్పడును. సోడియము బైకార్బనేటు (వంటసోడా) ద్రావణములో పరిశుభ్రమైన దూదిని ముంచి పుండ్లపై కప్పవచ్చును. ఇందువలన మంట ఉపశమించును. రోగి దేహముపై కంబళి కప్పి అతని దేహమును వెచ్చగ ఉండేటట్లు చేయాలి. అవసరమైతే అతని దేహమును వేడినీటిసీసాలతో కాచాలి. శరీరముపై కాలినభాగము హెచ్చుగా నున్నయెడల రోగి బలహీనంగా ఉంటాడు. అతనికి స్పృహకూడ తప్ప వచ్చును. స్పృహ తప్పనిచో అతనికి వేడికాఫీని గాని, పాలను గాని యీయవలయును. ఈవిధముగ ప్రథమ చికిత్సను చేసినపిమ్మట వైద్యునకు రోగిని అప్పచెప్పాలి.

నీవు ధరించిన బట్టలు అంటుకొంటే భయపడి పరుగెత్త కూడదు. ఆవిధముగ చేసినచో ఆ మంటలకు గాలి సాయమగుటచే అవి తగ్గుటకుబదులు హెచ్చును. అంతేకాదు నీవు నిలబడియున్నచో ఆ మంటలు పైకి ప్రాకి

నీముఖమును, తలవెంట్రుకలను కాల్చివేయును. అందువలన నీవు క్రిందపడి పొరలుట మంచిది. అపుడామంటలు ఆరిపోతాయి. నీ ప్రక్కనున్నవాని బట్టలు అంటుకొంటే, కంబళితోనో, గోనెతోనో, చాపతోనో వానిని కప్పి మంటలు ఆరిపోవువరకును నేలపై దొర్లింపవలెను.




అవసరము కలిగినపుడు ఉపయోగించుకొనుటకై కొన్నిమందులను పరికరములను ఒక పెట్టెలో అమర్చి అందుబాటులో నుంచుకొనుట మంచిది.

ఇట్టి సందర్భములలో నీళ్ళుపోసి మంటలను ఎన్నడును ఆర్పకూడదు.

హఠాత్తుగా అవసరము కలిగినపుడు ఉపయోగించు కొనుటకై కొన్ని మందులను, పరికరములను ఒక పెట్టెలో అమర్చి అందుబాటులో నుంచుకొనుట మంచిది. ఈ పెట్టెలో సాధారణముగా ఉంచుకొనవలసిన పరికరములను, మందులను ఇచ్చట చెబుతాను.

1. కట్లుకట్టుటకు గుడ్డపేలికలు—రెండు, మూడు, నాల్గు అంగుళముల వెడల్పుగలవి. ఉతికిన పాతపంచలు, చీరలు, దుప్పట్లు—వీటిని చింపి చుట్టలుగా చుట్టి జాగ్రత్త చేసికో వచ్చును.

2. లింటు అనే ప్రత్యేకమైన గుడ్డనో లేదా శుభ్రమైన గుడ్డపేలికలనో సలసల కాగుచున్న నీటిలో ఉడకబెట్టి ఆరనిచ్చి వాటిపైన రోగములను కలుగచేసే సూక్ష్మజీవులు చేరకుండా శుభ్రమైన కాగితములో చుట్టచుట్టి ఉంచుకోవాలి.

3. కాగితములో జాగ్రత్త పరచిన శుభ్రమైన దూది.

4. బిగింపుకట్టును కట్టుటకొరకు ఒక చిన్న పుల్ల ముక్క.

5. ఎముకలు విరిగినపుడు కట్లను కట్టుటకు ఉపయోగించుటకై ఒక అంగుళము మందము, మూడు లేక నాల్గు అంగుళముల వెడల్పుగల కొన్ని కఱ్ఱబద్దలు.

6. కత్తెర.

7. పదునైన చాకు.

8. టించరు అయోడీను.

9. లైసాలు. ఇది చేతులను శుభ్రము చేసికొనుటకును, రోగబీజములు చేరకుండ గాయములను కడుగుటకును ఉపయోగపడును. నాలుగు గ్లాసుల నీటికి ఒక టీచెంచా లైసాలును చేర్చి ద్రావణమును చేసి వాడవలెను.

10. బోరాసికు ఆమ్లము.

11. వ్యాసలీను.

12. పొటాసియముపర్మాంగనేటు.

13. సముద్రపుటుప్పు (అనగా సామాన్యలవణము).

14. ఆవగుండ.

15. సోడియముబైకార్బనేటు (వంటసోడా).

ఇవికాక నీ అనుభవమునుబట్టి మరికొన్ని పరికరములను, మందులను ఈ పేటికలో చేర్చికొనవచ్చును.

వైద్యనాథరావు.

# హెచ్చరికలు

చి. సౌ. సుశీలకు,

నీ కిదివరలో వ్రాసిన ఉత్తరములలోని సారాంశమును ఇచ్చట పొందుపరుస్తున్నాను. రోగిని చూడగానే నీవు ఏం చేయాలో, ఏం చేయకూడదో జ్ఞాపకముంచుకొంటే ప్రథమచికిత్స చేయడంలో నీ కెప్పుడూ పొరపాట్లు రావు.

అపాయము కలిగినవాడు శ్వాసిస్తున్నాడో లేదో తెలిసికోవాలి. వాని శ్వాస ఆగిపోతే వెంటనే కల్పిత శ్వాసను ప్రారంభించాలి.

రక్తస్రావం ఏమైనా ఉందేమో కనిపెట్టాలి. అది ఉంటే గాయమువద్ద ఒత్తిడి కలుగజేసికాని లేదా బిగింపు కట్టును కట్టికాని రక్తస్రావమును అరికట్టాలి.

ఎముకలు విరిగాయేమో తెలిసికోవాలి. విరిగిన ఎముక కదలకుండా కట్లుకట్టాలి. అంతవరకూ వానిని కదలనీయరాదు.

అవసరమైతే వైద్యునికి వెంటనే కబురుచెయ్యాలి.

బట్టలు బిగువుగా ఉంటే వాటిని సడలించాలి. బెల్టు ఉంటే దానిని తీసివేయాలి.

వాంతి చేసికుంటూ ఉంటే అతని తలను కొంచెము క్రిందికి, ప్రక్కకు ఉండునట్లు అమర్చాలి. లేకపోతే ఆ వమనము ఊపిరితిత్తులలోనికి పోయి అతడు ఉక్కిరి బిక్కిరి అవుతాడు.

స్పృహ తప్పినవానికి త్రాగుటకు ఏ పానీయము లను యీయకూడదు.

వేడినీటి సీసాలకు గుడ్డను చుట్టి తరువాత వాటిని వాని శరీరమునకు తాకించి కాచాలి. లేకపోతే దేహము బొబ్బలెక్కుతుంది.

రోగిచుట్టు జనం మూగితే వారిని పంపించివేయాలి.

చికిత్స చేసేవారు తొట్రుపాటు పడకుండా ప్రశాంతంగా పనిచేస్తూ రోగికి వారియందు గురి, నమ్మకము కలుగునట్లు ప్రవర్తించుకోవాలి.

రోగివద్ద సందడి చేయకుండ అతనిని మెచ్చగ నుంచి, ధైర్యము చెప్పి, నీచికిత్సవలన అతనికి సదుపాయము, సౌఖ్యము కలుగునట్లు చూడాలి.

నేను వ్రాసిన ఉత్తరా లన్నీ చదివినపిమ్మట ప్రథమచికిత్స చేయగలవనే ధైర్యం నీకు కలిగిందను కుంటాను. నేను వ్రాసిన ఉత్తరములను చదివి అవగాహన చేసికొనినంతమాత్రమున కొన్ని చికిత్సలను నీవు సక్రమంగా నిర్వహించ లేకపోవచ్చును. నీవు వంట బాగా చేస్తావు కాని ఈవంట చేయడం నీవు పాకశాస్త్రం చదివి నేర్చుకొన్నావా ? చిన్నప్పటినుండి మీ అమ్మకు సాయం చేస్తూ ఆమె ఏయే వంటలు ఏలాగున వండునో ప్రత్యక్షంగా చూసి నీవు ఆపనిలో ఆరితేరావు. అదేవిధంగా ప్రథమచికిత్సలోకూడా నీవు ప్రత్యక్షమైన తర్ఫీదును పొందాలి.

నీవు మహిళాసంఘపు కార్యదర్శినివి కదూ! ప్రథమచికిత్సలను గూర్చిన విషయములను ప్రత్యక్షంగా చేసి చూపించుటకొరకు ఒక డాక్టరుగారిని మీ సంఘం తరఫున ఆహ్వానింపుము. నా ఉత్తరాలను చదివినమీదట నీ కాచికిత్సలన్నీ సులభంగా అవగాహనం అవుతాయి. అంతేకాదు. ఆ డాక్టరుగారి ఎదుట మీ సంఘంలో ఒకరికి ఎముక విరిగినదనుకొని కట్టు కట్టి చూపించు; శ్వాస ఆగినదనుకొని కల్పితశ్వాసను ప్రారంభించు; హెచ్చుగా రక్తము కారిపోవుచున్న దనుకొని బిగింపుకట్టును కట్టు—అప్పుడు

నీవు ప్రథమచికిత్సలో పూర్తిపరిజ్ఞానమును సంపాదింప గలుగుతావు.

సుశీలా! మానవసేవయే మాధవసేవ యని భావించి సమయము వచ్చినపుడు ధైర్యముగా బాధితులకు సహాయము చేసి నీ జీవితమును ధన్యము గావించుకొనుము.

ఇట్లు,

మీ నాన్న,

వైద్యనాధరావు.

# కృతజ్ఞత

పూజ్యులైన తండ్రిగారికి,

సుశీల అనేక నమస్కారములు.

మీరు వ్రాసిన ఉత్తరాలన్నీ అందాయి. ఆ జాబులలోని అంశాలు నాకు సులభముగా అర్థమైనాయి. ప్రథమ చికిత్సనుగూర్చిన అనుభవం ప్రతివ్యక్తికీ ఉండితీరాలనడంలో సందేహం ఏమీలేదు.

ప్లీడరు రామారావుగారి కూతురు కీమధ్య చీర అంటుకొని ఒడలు కాలింది. పాపం! ఆమెకు మూర్ఛరోగం ఉంది. వంటచేస్తూ పొయ్యివద్ద పడిపోయింది. చీర అంటుకొని మండిపోతూ ఉండడం చూచి ఆమె అక్క ఒక బిందెడు చన్నీళ్లు తెచ్చి ఆమెపై పోసి మంటలను ఆర్పివేసింది. అందువలన ఆమెచర్మం చాలా భాగం బొబ్బలెక్కాయి. ఆమెకు వెంటనే నిస్త్రాణ కలిగి డాక్టరు వచ్చేలోగానే ఆమె చనిపోయింది. చికిత్సలనుగూర్చి సామాన్యంగా ప్రతీవ్యక్తీ తెలిసికోవలసిన ప్రాథమిక

విషయాలనుకూడా రామారావుగారి యింట్లో వారు తెలిసికో లేకపోయినందుకు డాక్టరు వారిని మందలించారు. వారి పెద్దమ్మాయి తెలివితక్కువతనంచేత లక్ష్మీదేవిలాంటి చిన్నమ్మాయిని రామారావుగారు కోల్పోయారు.

వచ్చేవారం మహిళాసంఘంలో ప్రథమచికిత్సాపద్ధతులను బోధించుటకు డాక్టరు మాధవరావుగారు దయతో అంగీకరించారు.

నాన్నా! నన్ను చిన్నతనంనుండి అల్లారుముద్దుగా పెంచారు; నా నడవడిని తీర్చిదిద్దారు; నాకు విద్యాబోధన స్వాంతంగా మీరే చేశారు. అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లుగా శాస్త్రవిషయా లన్నింటినీ సులభంగా బోధించారు. మీరు, అమ్మ అన్యోన్యఅనురాగాలతో ఇంట్లో మసలి నాకు మార్గదర్శకులైనారు. ఇప్పటికినీ నా బాగోగులవిషయమై శ్రద్ధవహిస్తున్నారు. ఈమధ్య మీరు ప్రథమచికిత్సా పద్ధతులను బోధిస్తూ వ్రాసిన ఉత్తరాలే అందుకు తార్కాణం.

మీ యింట్లో పుట్టడం నిజంగా నా భాగ్యవిశేషం అనుకొంటున్నాను. నేను ఉత్తమమైన యిల్లాలిననీ, మీయన అదృష్టంచేత నే నాయనకు భార్యను అయినా ననీ

ఈమధ్య మీఅల్లుడుగారు ఒకరితో అంటూవుంటే విన్నాను. నాయందు ఆయనకు యిటువంటి సదభిప్రాయం కలగడం నా పుణ్యవిశేషంగాక మరేమిటి నాన్నా! దీని కంతటికీ మీరు ఆదర్శంగా మమ్మల్ని పెంచడమే కారణం. అందులకు నా కృతజ్ఞతాపూర్వక వందనములను అర్పిస్తున్నాను. వాటిని అందుకొని నన్ను ఆశీర్వదించండి.

ఇట్లు,
విధేయురాలు,
సుశీల.



రచయిత

యస్ (సామ్రాజ్యం) యల్ (లక్ష్మి) నరసింహారావు. జననం 1911. వృక్ష, జంతు శాస్త్రాల్లో ఆంధ్రవిశ్వవిద్యాలయ పట్టభద్రుడు (1931). బోధనశాస్త్రంలో మదరాసు విశ్వవిద్యాలయం పట్టభద్రుడు (1935). కాకినాడ పిఠాపుర రాజ (నేడు) ప్రభుత్వపాఠశాలలో 1935 నుంచీ ఆరితేరిన ఉపాధ్యాయుడు.

తన పాఠశాలలో, తూర్పుగోదావరిజిల్లా ఫలపుష్ప ప్రదర్శనలలో, అఖిలభారతాయుర్వేద మహాసభలో, దేశీయవైద్యసభలలో వస్తుప్రదర్శనలు గావించినారు.

1939 లో గుంటూరునందు జరిగిన విద్యావిషయిక ప్రదర్శనములోను, 1940 లో తెనాలిలో జరిగిన ఆంధ్ర టీచర్సు ఫెడరేషన్ సభలలోను సైన్సు ఎగ్జిబిషన్లు నడిపించినారు.

శాస్త్రవిషయాలు సామాన్యుల కవగాహనమయేలాగ ఉపన్యాసాలివ్వడం, పుస్తకాలువ్రాయడం ఈయనపనీ, అభినివేశమూను. ఇతర అభిమానవిషయాలు ఫోటోగ్రఫీ, ఆయుర్వేదం, ఓషధుల సేకరణ.

ఈయన వ్రాసిన 'మనదేహము' శరీరశాస్త్రం.

'తరతరాల తాతలనాటి లక్షణాలేనా ?' (1955), 'ఆంధ్రదేశపు ఖనిజసంపద' (1957) అనే రెండు పుస్తకాలూ ఆంధ్రప్రదేశ ప్రభుత్వము వారిచే ఉత్తమ గ్రంథములుగ నిర్ణయింపబడి బహూకరింపబడినవి.

బహుళ విద్యాప్రచారం కోసం కేంద్రవిద్యాశాఖవారు వ్రాయించుచున్న గ్రంథాలలో ఈయన వ్రాసిన 'అజ్ఞానం—విజ్ఞానం' (1955), 'విజ్ఞాన మందిరం' (1956), 'డాక్టరు వచ్చేలోగా ఏం చెయ్యాలి ?' (1957) అనే గ్రంథాలు తెనుగులో అత్యుత్తమగ్రంథాలుగా నిర్ణయింపబడ్డాయి. తరువాత మన దేశభాషలన్నిటికీ కలిపి జరిగిన పోటీలలో 'విజ్ఞానమందిరం', 'డాక్టరు వచ్చేలోగా ఏంచెయ్యాలి?' అనే రెండుపుస్తకాలూ తిరిగి అధికబహుమాన యోగ్యములుగా ఎంచబడినవి. ఈ రెండూ 14 భారతీయభాషలలోనికి తర్జుమా చేయబడుచున్నవి.

1957 లో 'నెల్లూరు ప్రోగ్రసివ్ యూనియన్' వారీయనకు 'కవికోకిల వైజ్ఞానిక బహుమతి' నిచ్చిరి.